# అధర్వవేదతంత్రము

# మహానిర్వాణ తంత్రము

# రస తంత్రము


సాహిత్యవిద్యాప్రవీణ, తర్క-వేదాంత ధురీణ
జ్యోతిష తంత్ర పారీణ

బ్రహ్మశ్రీ **మేడవరపు సంపత్‌కుమార్**

M.A. సంస్కృతం



పబ్లిషర్స్ ఫోన్ : 2465253

**గొల్లపూడి వీరాస్వామి సన్**

కోటగుమ్మం, రాజమండ్రి - 533101.


 2009 వెల : 75-00

# అథర్వవేదతంత్రము
# మహానిర్వాణ తంత్రము
# రసతంత్రము

ప్రధమముద్రణ : ౨౦౦౮ మే

by

**మేడవరపు సంపత్‌కుమార్** (కాకినాడ - 2)

గుజరాత్ మొబైల్ : **099983 44758**

e-mail : sampth 2016@yahoo.com

**ముఖచిత్రాలంకరణ :**

**కె.బి. క్రియేషన్స్**

**రాజమండ్రి., ఫోన్ : 2464707**

**గ్రంథ ముద్రణ :**

**శ్రీ మహేశ్వరి ఆఫ్‌సెట్ ప్రింటర్స్**

**రాజమండ్రి - 533 104., ఫోన్ : 2478594.**

**ముఖచిత్ర ముద్రణ :**

**ఈశ్వర్ గ్రాఫిక్స్**

**రాజమండ్రి - 533 103., ఫోన్ : 2461532**

సిద్ధులు –యోగులు– గురుతుల్యులు అయిన వీరందరికీ నా సాష్టాంగ నమస్కారములు.

1. మహామహోపాధ్యాయ పండిత గోపీనాధ్ కవిరాజ్
2. యోగిరాజ్ శ్రీగురునాధ్‌జీ అవధూత
3. శ్రీకరపాత్రీజీ భాగవతాచార్య
4. పండిత దామోదరజీ దర్శనాచార్య తంత్రభాస్కర
5. శ్రీకేశవమూర్తి కాపాలిక
6. శ్రీనంగేబాబా అవధూత
7. శ్రీశాలిగ్రాంజీ పాఖండీ బాబా
8. భూతభైరవ్ బాబా

సిద్ధులు సాధకులు తపోనిష్ఠులు సన్యాసులు కాశీలోని కాళిమఠం సిద్ధ మహాయోగులు.

1. స్వామి గణేశానందజీ సరస్వతి
2. స్వామి హరిహరానందజీ సరస్వతి
3. స్వామి దామోదరానందజీ సరస్వతి
4. స్వామి ఠాకూరానందజీ సరస్వతి
5. స్వామి విశ్వేశ్వరానందజీ సరస్వతి

2

శ్రీ మహాగణాధిపతయే నమ:

# అధర్వ వేదం

ఇది 20 కాండములలో ఉన్నది. భృగుమహర్షి శిష్యుడు అధర్వుడు. ఇతని 20మంది కుమారులు 20 కాండలను దర్శించారు. 20 కాండలలో 760 సూక్తములు, 5,987 మంత్రములు ఉన్నాయి. తపస్సు చేస్తున్న బ్రహ్మ శరీరం నుండి అధర్వుడు, అంగీరసులు జన్మించారని వీరి వంశముల వారి చేతనే అధర్వవేదం దర్శించబడిందని గోపథ బ్రాహ్మణంలో చెప్పబడింది.

ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము ఎక్కువగా ఆధ్యాత్మిక ప్రయోజనాన్ని ఇస్తాయి. కాని అధర్వవేదం మాత్రం ఇహలోకంలో బాధలు నివృత్తి చేసుకోవడానికి, సుఖాలు, ధనలబ్ధి, ఇష్టసిద్ధి పొందటానికి, శారీరక, మానసిక ఆరోగ్యసిద్ధికి మంత్ర– తంత్ర – ఔషధంగా ఉపయోగపడుతుంది.

అధర్వవేదం 9 శాఖలుగా నున్నది. ప్రస్తుతం రెండు మాత్రమే లభించుచున్నవి. పిప్పలాద, శౌనకశాఖలు. పిప్పలాద శాఖ కాశ్మీరంలో ఎక్కువ వ్యాప్తిలో నున్నది. ప్రస్తుత రచన శౌనకసంహిత నాధారం చేసుకొని చేయబడింది. మిగిలిన చారణ వైద్యశాఖలు, అధర్వవేదంలో 5వవంతు. అనగా 1200

మంత్రాలు ఋగ్వేదం లోనివే. ఋగ్వేదంలో 1-8-10 మండలములలో నున్నాయి.

ఈ అథర్వవేదమునకు 5 కల్ప సూత్రములున్నవి.

1. నక్షత్రకల్పం - నక్షత్ర పూజా హోమములు, అమృతాది అభయాంతము 30 మహాశాంతులు గలవు. 2. వైతాన సంకల్పం - వేదకర్మలందు ఋత్విక్కుల కర్తవ్యము. 3. సంహితావిధి - దీనికే కౌశిక సూత్రమని పేరు. గ్రామ, పట్టణ, దేశలాభ నిమిత్త ములు, ధనం కుటుంబ సర్వ సంపత్సాధకములు, పుష్టికర్మలు చెప్పబడ్డాయి. 4. అంగీరసకల్పము - ఇందు అభిచార కర్మలు, నివారణలు, ఆత్మరక్షాకరములు చెప్పబడ్డాయి. 5. శాంతికల్పము, నవగ్రహ హోమములు, శాంతి, పుష్టి కర్మవిషయములు చెప్ప బడ్డాయి.

శౌనకశాఖ అథర్వవేదం మొట్టమొదట జర్మనీలోని "బెర్లిన్" లో "రోట్విట్నీ" ప్రచురించారు. ఇందులో 598 సూక్తములు, 5,038 మంత్రములు ఉన్నాయి.

తరువాత బొంబాయిలో సాయణ భాష్యసంహితంగా శంకర పాండురంగ పండితులు 736 సూక్తాలతో, 6,018 మంత్రము లతో ప్రచురించారు. అవధ్ ముఖ్య పట్టణములో స్వాధ్యాయ మండలి పండితులు 751 సూక్తాలతో, 5,977 మంత్రాలతో ప్రచురించారు.

అధర్వవేదం పిప్పలాద శాఖ మొట్టమొదటి "రాన్" సంపాదించినది. బ్లూంఫీల్డ్ అను అమెరికన్ సంస్కృత పండితుడు బాల్టిమో పట్టణంలో ప్రచురించాడు.

అధర్వణ భద్రకాళి అయిన ప్రత్యంగిరా సూక్తము పిప్పలాద అధర్వ సంహితలో 16వ కాండలో 5 సూక్తములలో 44 మంత్రములు ఉన్నవి.

పురాకల్పములో దేవదానవ యుద్ధంలో ఓడిపోయిన దేవతలు విష్ణువును ప్రార్థించగా అతడు సుదర్శనచక్రమును ప్రయోగించెను, కాని అది విఫలమయ్యేను. అపుడు విష్ణువు పరమేశ్వరునితో మీచే ఇవ్వబడిన చక్రము రాక్షస సంహారములో విఫలమయ్యేనని మొరలిడెను. శివుడు పరాశక్తిని స్మరించగా ఆమె దివ్యప్రభలతో ఆవిర్భవించి రాక్షస సంహారము చేసెను. అపుడు శివుడు పరాశక్తితో ప్రతిపక్ష నాశిని, ప్రతిమంత్ర భక్షిణి అయిన నీవు ఇకపై ప్రత్యంగిరా భద్రకాళిగా ప్రఖ్యాతి గాంతువని ఆదేశించెను. ఈమెనే నికుంభిల అందురు.

ఈ ప్రత్యంగిరా సూక్తము ఋగ్వేదములో "ఖిల" భాగమని వేదపండితుల అభిప్రాయము. ఖిలమనగా "పరశాఖీయం స్వశాఖా యాం ఆపేక్షావశాత్ పఠ్యతే తత్ ఖిలముచ్యతే" ఇతర శాఖలోని సూక్తములను, దానిపై ఉన్న "ఆపేక్ష" వలన స్వశాఖలో

చేర్చినచో దానిని "ఖిలం" లేక ఖిలసూక్తములు అంటారు. ప్రత్యంగిరోపాసన క్రోధము లేనివారు మాత్రమే చేయవలెను. ప్రత్యంగిరా భద్రకాళి సర్వ శత్రువులను నాశనమొనర్చును. పరమంత్ర– పరతంత్ర – పరయంత్ర సర్వ ప్రయోగములను భక్షించును. అందుచే ఈ మంత్ర సాధకులు ఆవేశము లేనివారై సాధుస్వభావముతో ఉండాలి. ఆవేశముతో ఏమాట అన్ననూ అనగా ఏ చెడ్డమాట పలికిననూ అది నిజమై బాధించును. అందుకే "వారాహీ" మంత్రోపాసన చేయు వారి వాకిట్లోనూ, ప్రత్యంగిరా చేయువారి ప్రక్కననూ ఉండరాదని సామెతగా ఏర్పడినది. పరుల శ్రేయస్సుకు ప్రత్యంగిరా చేయవచ్చు. మంత్ర శాస్త్ర ప్రయోజనం సన్మార్గమే కానీ దుష్టస్వార్థము కాదు.

అథర్వవేదం 15వ కాండ–వ్రాత్యకాండ అంటారు. వ్రాత్యుల కర్మలు ఇందు చెప్పబడ్డాయి. 18 సూక్తములు, 230 మంత్ర ములు ఉన్నాయి. వ్రాత్యులనగా ఆచార నియమాలు లేనివారని, ఆర్యులలోనే ఒక తెగవారని అథర్వాన్ని బట్టి తెలుస్తోంది.

వైదిక మంత్రాలను వివరించే వాటిని "బ్రాహ్మణములు" అంటారు. ఇవి 4 వేదములకు వేరువేరుగా ఉన్నాయి. యజ్ఞ యాగాది కర్మవిషయములు విపులంగా చెబుతూ వాటి ప్రోద్బ లకంగా కథలు గూడా బ్రాహ్మణములలో చెప్పబడ్డాయి.

ఋగ్వేదంలో ఊర్వశీ, పురూరవ వృత్తాంతం శతపధ బ్రాహ్మణం లో విపులంగా కధగా చెప్పబడింది. జలప్రళయం గూర్చి శతపధంలో చెప్పబడింది. ఈగాధ ఇతర మత గ్రంధాలలోనూ, ప్రాచీనభాషా గ్రంధాలలోనూ పేర్కొనబడింది. బ్రాహ్మణ గ్రంధాలు వేదాలలో ఒక భాగంగా పరిగణించబడ్డాయి.

"మంత్ర - బ్రాహ్మణాత్మకో వేదః" అని ఆపస్తంభుడు ప్రమాణీ కరించాడు. ప్రతీ వేదమునకు బ్రాహ్మణ గ్రంధము లున్నవి.

| వేదము | లభిస్తున్న బ్రాహ్మణములు |
|---|---|
| 1. ఋగ్వేదము | 1. ఐతరేయ బ్రాహ్మణము<br>2. శాంఖాయన బ్రాహ్మణము |
| 2. శుక్ల యజుర్వేదము | 1. శతపధ బ్రాహ్మణము |
| కృష్ణ యజుర్వేదము | 1. తైత్తరీయ బ్రాహ్మణము |
| 3. సామవేదమము | 1. తాండ్య 2. షడ్వింశ 3. సామ విధాన 4. ఆర్షేయ 5. దేవతాధ్యాయ 6. ఉపనిషద్ 7. సంహితో పనిషత్ 8. వింశ 9. జైమినీయ బ్రాహ్యణము |
| 4. ఆధర్వవేదము | 1. గోపథ బ్రాహ్మణము. |

బ్రాహ్మణములకు పరిశిష్ట గ్రంథములు అరణ్యకములు ఉప నిషత్తులు అనబడును. అరణ్యములలో నివసిస్తూ అధ్యయనం చేయవలసిన విషయములు కనుక వీటికి అరణ్యకములని పేరు. వీటిలో ప్రాణవిద్య, ఆధ్యాత్మిక జ్ఞానం బోధించబడ్డాయి. ఋగ్వేద మునకు ఐతరేయారణ్యకం, శాంఖాయనారణ్యకం ఉన్నాయి. యజుర్వేద – సామవేదములకు కూడా అరణ్యకము లున్నాయి. అధర్వ వేదమునకు అరణ్యకములు లభించుటలేదు. కాలగర్భంలో కలిసి పోయినవి కేవలం ఉపనిషత్తులు మాత్రం లభిస్తున్నాయి.

వేదములకు కల్పగ్రంథములు, సూత్ర గ్రంథములు కూడా యున్నవి. అధర్వవేదమునకు 5 కల్పగ్రంథములున్నవి. ఒకేఒక్క గృహ్యాసూత్ర గ్రంథమున్నది. గృహ సంబంధిత విషయములు, కుటుంబ జీవితం కర్మవిధానం ఇందు తెలియజేయబడును. దీనిపేరు “కౌశిక గృహ్యా సూత్రం” 14 అధ్యాయములున్నవి. హారీత, కేశవులు వ్యాఖ్యానం వ్రాశారు. అనేక ప్రయోగములు, వైద్య – ఇంద్రజాల విద్య చెప్పబడ్డాయి.

వేదముల రక్షణ కొరకు “అనుక్రమణిక” గ్రంథాలు తరువాత ఋషులు రచించారు. ప్రతీ వేదమునకు ప్రత్యేక అనుక్రమణిక గ్రంథములున్నవి. వీటిలో ఆ వేదమంత్ర వివరణ ఋషి – దేవతా – ఛందస్సు – వాటి ప్రయోజనం. సూక్తసంఖ్య, నామ – విశేషణ వివరణలు తెలుపబడ్డాయి.

అధర్వవేదమునకు అయిదు అనుక్రమణికా గ్రంధము లున్నవి.

1. చతురధ్యాయి 2. ప్రాతిశాఖ్య 3. పంచపటలిక 4. దంత్యోష్ఠవిధీ 5. బృహత్సర్వాను క్రమణిక.

అధర్వవేదంలో ఎన్నో అమూల్య విషయములున్నాయి. ఇంద్రియాతీత ప్రపంచం గూర్చి ఎన్నో విషయాలున్నాయి. కొందరు వ్యాఖ్యానం వ్రాసినా, భాష్యాలు వ్రాసినా, ఎన్నో విషయాలు తెలియవలసినవి అజ్ఞాతంగానే ఉన్నాయి. ఉదాహరణకు 5వ కాండలో 28వ సూక్తము ఉన్నది. ఇది దీర్ఘాయుప్రాప్తి కొరకు చెప్పినది, మొదటి మంత్రం –

నవప్రాణాన్ నవభిః సంమిమీతే దీర్ఘాయుత్వాయ శత శారదాయ। హరితేత్రీణి రజతే త్రీణ్యయసే త్రీణి తపసావిష్టితాని॥

దీనియొక్క వాచ్యార్థం సుగమంగా యున్నా, మార్మికార్థం యౌగికంగా తెలియరాకున్నది. ఇటువంటి మంత్రముల అంతరార్థం సాధనలోనే తెలియాలి.

ఇందు చెప్పిన మంత్రములు, స్వరయుక్తముగా వేదపండితుల వద్ద గానీ, మంత్ర శాస్త్రవేత్తల వద్ద గానీ నేర్చుకుని ప్రయోగించాలి. వేదములో ముఖ్యముగా 3 స్వరములున్నవి.

ఇవి ఉదాత్త, అనుదాత్త స్వరితస్వరములు . “మంత్రోహీనః స్వరతో వర్ణతోవా....” అన్నారు. అంటే మంత్రము స్వరహీన మైననూ, అక్షరహీనమైననూ ఫలించదు. ఇంద్ర శతృః వర్ధస్వ అను మంత్రములో స్వరభేదము చేత రాక్షసుడు చేసిన హోమము రాక్షసునికి కాకుండా ఇంద్రునికి జయము కలిగించినది. అందు చేత శ్రేయస్కాములైనవారు వేదపండితులైన బ్రాహ్మణోత్తముల చేత శాంతికర్మలు చేయించుకొని అందరూ సుఖపడాలని, ఇటువంటి వేదమంత్రానుష్టాన జ్ఞాన ప్రతిపాదక పుస్తకములు నేను మరింతగా ప్రచురించాలని అందుకు వేదమాత ఆశీస్సులు కోరుతూ జ్ఞాన వయోవృద్ధులందరికీ వందనము లర్పిస్తున్నాను.

మాస శివరాత్రి — తంత్ర జిజ్ఞాసువు

1990 మార్చి — మేడవరపు సంపత్కుమార్.

**ఓం నమఃశివాయ**

**ఋణ - రోగ -శత్రు సమస్యలకు**

**గ్రహబాధా నివృత్తికి, వేదోక్త, తంత్రోక్త జప**

**హోమములు చేయబడును.**

**మేడవరపు సంపత్కుమార్**

# విషయసూచిక

## అథర్వవేదతంత్రము

## మహానిర్వాణ తంత్రము



## రస తంత్రము

శ్రీ మహాగణాధిపతయే నమ:

# అధర్వ వేదం

(మంత్ర-తంత్ర-వైద్య రహస్యాలు)

1-ఉచ్ఛిష్ట బ్రహ్మ- సూక్తం, 11 కాండం- 7-సూక్తం అధర్వ ఋషి: ॥ ఉచ్ఛిష్ట దేతా ॥ అనుష్టుప్ ఛంద: 6-పుర ఉష్ణిగ్గార్హతపర ఛంద:- 21 స్వరాట్ ఛందః- 22 విరాట్ పధ్యాబృహతీ ॥

**శ్లో॥ ఉచ్ఛిష్టే నామరూపంచోచ్ఛిష్టే లోక ఆహితః**
**ఉచ్ఛిష్ట ఇంద్రశ్చాగ్నిశ్చ విశ్వమంతః సమాహితమ్ 1**
**ఉచ్ఛిష్టే ద్యావాపృధివీ విశ్వంభూతం సమాహితమ్**
**ఆసః సముద్ర ఉచ్ఛిష్టే చంద్రమావాత ఆహితః 2**
**సన్నుచిష్టే అసంశ్చోభౌ మృత్యుర్వాజ: ప్రజాపతిః**
**లౌక్యా ఉచ్ఛిష్ట ఆయత్తా వ్రశ్చద్రశ్చాపి శ్రీర్మయి 3**

దృఢో దృంహస్త్రిరోన్యో బ్రహ్మ విశ్వసృజో దశ
నాభిమివ సర్వతశ్చక్ర ముచ్ఛిష్టే దేవతాః శ్రితాః 4
ఋక్ సామ యజురుచ్ఛిష్ట ఉద్గీథ: ప్రస్తుతం సుతమ్
హింకార ఉచ్ఛిష్టే స్వరఃసామ్నో మేడిశ్చతన్మయి 5
ఐంద్రాగ్నం పావమానం మహినామ్ని మహావ్రతమ్
ఉచ్ఛిష్టే యజ్ఞ స్యాంగా న్యంతర్గర్భ ఇవమాతరి. 6
రాజసూయం వాజపేయ మగ్నిష్టో మస్తదధ్వరః
ఆర్కాశ్వమేధా ఉచ్ఛిష్టే జీవబర్హిమదింతమః 7
అగ్న్యాధేయ మథోదీక్ష కామప్రచ్ఛందసా సహః
ఉత్సన్నా యజ్ఞాః సత్రాణ్యుచ్ఛిష్టోఽధిః సమాహితాః 8
అగ్నిగోత్రం చ శ్రద్ధాచ వషట్కారో వ్రతం తపః
దక్షిణేష్టం పూరం చోచ్ఛిష్టేఽధి సమాహితాః 9
ఏకరాత్రో ద్విరాత్రః సద్యఃక్రీః ప్రక్రీరక్త్యైః
ఓతం నిహితముచ్ఛిష్టే యజ్ఞస్యాణూని విద్యయా 10
చతూరాత్ర: పంచరాత్రః షడ్రాత్రశ్చో భయః
సహ షోడశీ సప్తరాత్రశ్చోచ్ఛిష్టాజ్జజ్ఞిరే సర్వేయే-
యజ్ఞా: అమృ తే హితాః 11
ప్రతీహారో నిధనం విశ్వజిచ్చాభీ జిచ్చయః
సహ్నాతి రాత్రా ఉచ్ఛిష్టే ద్వాదశాహోపితన్మయి 12

సూనృతా సంనతిః క్షేమః స్వధోర్జామృతం సహః
ఉచ్ఛిష్టే సర్వే ప్రత్యంచః కామా:కామేన తాత్పపుః 13
నవభూమీః సముద్రాః ఉచ్ఛిష్టేఽధీ శ్రితా దివః
ఆసూర్యో భాత్యుఽహో రాత్రేపి తన్మయి 14
ఉపహవ్యం విఘావంతం యేచ యజ్ఞా గుహోహితాః
బిభర్తి భర్తా విశ్వస్యోచ్ఛిష్టే జనితః పితా 15
పితా జనితురుచ్ఛిష్టోఽసోః పౌత్రః పితామహః
స క్షియతి విశ్వశ్యేశానో వృషాభూమ్యా మతిఘ్న్యః 16
ఋతం సత్యంతపో రాష్ట్రం శ్రమోధర్మశ్చ కర్మచ
భూతం భవిష్య దుచ్ఛిష్టే వీర్యం లక్ష్మీర్బలంబలే 17
సమృద్ధిరోజ ఆకూతిః క్షత్రం రాష్ట్ర షడుర్వ్యః
సంవత్సరోఽధ్యుచ్ఛిష్ట ఇడాప్రైపా గ్రహోహవిః 18
చతుర్హోతార ఆప్రియశ్చా తుర్మాస్యాని నీవిదః
ఉచ్ఛిష్టే యజ్ఞాః హోత్రాః పశుబంధాః స్తదిష్టయః 19
అర్ధమాసాశ్చ మాశ్చార్తవా ఋతుభిస్సహ
ఉచ్ఛిష్టే ఘోషిణీరాపః స్తనయిత్నుః శృతీరహీ 20
శర్కరాః సికతా అశ్మాన ఓషధయో వీరుధస్తృణా
అభ్రాణి విద్యుతో వర్షముచ్ఛిష్టే సంశ్రితాశ్రితా 21
రాద్ధిః ప్రాప్తిః సమాప్తి ర్వ్యాప్తిర్మహ ఏధతుః
అత్యాప్తీ రుచ్ఛిష్టే భూతిశ్చాహితా నిహితాహితా 22

**యచ్చప్రాణతి ప్రాణేన యచ్చ పశ్యతి చక్షుషా**
**ఉచ్ఛిష్టే జ్జజ్ఞి రేసర్వే దివిదేవా దివిశ్రితాః 23**
**ఋచః నామాని ఛందాసి పురాణం యజుషాసహ**
**ఉచ్ఛిష్టా జ్జజ్ఞి రేసర్వే దివిదేవా దివిశ్రితః 24**
**ప్రాణాపానౌ చక్షుః శ్రోత్రమక్షితిశ్చ క్షితిశ్చయా**
**ఉచ్ఛిష్టా జ్జజ్ఞి రేసర్వే దివిదేవా దివిశ్రితః 25**
**ఆనందామోదాః ప్రముదోఽభీమోద ముదశ్చయే**
**ఉచ్ఛిష్టా జ్జజ్ఞి రేసర్వే దివిదేవా దివిశ్రితః 26**
**దేవాః పితరో మనుష్యా గంధ ర్వాప్సరసశ్చయే**
**ఉచ్ఛిష్టా జ్జజ్ఞి రేసర్వే దివిదేవా దివిశ్రితః 27**

★ఈ సూక్తం మంత్రశాస్త్రంలో ప్రముఖ గణపతి అయిన ఉచ్ఛిష్ట గణపతికి 1ఉద్ధారమైనది. వేదప్రతిపాదికం అగుచున్నది. సవ్య మార్గంలో ఉచ్ఛిష్ట గణపతి ఉపాసన వలన ఐహికాముష్మికములు రెండూ లభించును. దీనికి అసాధ్యమైనది లేదు. జపమాత్ర సిద్ధి.

సర్వమూ నామరూపాత్మకమైన దంతయు ఉచ్ఛిష్ట సంభూతము. లోకపాలకులు, దేవతాది గణములు, గ్రహములూ మొ॥ అంతా ఉచ్ఛిష్ట సంభూతమే. గణపతి కూడా పరాశక్తి దేహోచ్ఛిష్టం (ఒంటి నలుగుపిండి) నుండి ప్రభవించిన వాడే. తాత్విక దృష్టితో చూచే

దృక్కోణం వేరు. భేదబుద్ధి గల దృష్టి వేరు. స్థాయీభేదాన్ని అను సరించి, రుచిభేదాన్ని అనుసరించి ఉపాసనా విధానాలు ఏర్పడ్డాయి. పదిమందికీ మేలు జరిగి తనకీ మేలు జరగాలనుకుంటే సద్బుద్ధి. సద్విద్య, దక్షిణాచారం, దుష్టబుద్ధితో, చెడు చేయాలనుకుంటే క్షుద్ర విద్య, వామాచారం అవుతుంది. బుద్ధిభేదమే గానీ ఉన్నది ఒక్కటే. కత్తిని పండ్లను కోయటానికీ ఉపయోగించవచ్చు. హత్య చేయడానికి కూడా ఉపయోగించవచ్చు. గణపతి విద్యలలో ఉచ్ఛిష్ట గణపతి శీఘ్ర ఫలదాయకుడు అందులో సందేహం లేదు. ఎంతచేస్తే అంత.

## దీర్ఘాయువు కొరకు

ఈ సూక్తము జన్మనక్షత్రం రోజున, జన్మవారం రోజున, జన్మతిథి రోజున 108 సార్లు పారాయణ చేయవలెను. 3 వేలు జపానంతరం, ఈ సూక్తంతో హోమం చేసినచో "ఆయుర్దాయము" పెరుగుతుంది. నిత్యమూ పఠించవచ్చు.

1-5 అధర్వ ఋషిః, 2-3 బృహస్పతి, 4-5 విశ్వ దేవతలు, త్రిష్టుప్-4, అనుష్టుప్-5 విరాట్ జగతి ఛందస్సులు.

**ఆయుర్దా అగ్నే జరసం వృణానో ఘృతప్రతీకో ఘృతపృష్ఠో ఆగ్నే॥ ఘృతంపీత్వా మధుచారు గవ్యం పి తేవ పుత్రానభి రక్షతాదిమం॥ పరింధత్త ధత్తనో వర్చ సేమం జరామృత్యుం**

**కృణుత దీర్ఘమాయుః బృహస్పతిః ప్రాయచ్ఛత్ వాస ఏతత్ సోమాయరాజ్ఞే పరిధాతవా ఉ। పరీదం వాసో అధిధిః స్వస్తయే భూర్గృష్టినా మభీశ స్తిపా ఉ శతం చ జీవశరదః పురూచీ రాయశ్చపోష ముప సంయయస్వ ॥ ఏహ్యాశ్మానమా తిష్ఠాశ్మా భవతు తే తనూః ॥ కృణంతు విశ్వేదేవాః ఆయుస్థే శరదః శతం ॥ యస్యతే వాసః ప్రథమ వాస్యం హరామ స్తంత్వా విశ్వేవంతు దేవాః ॥ తంత్వా భ్రాతరః సువృధా వర్ధమానమను జాతం తాం బహవః సుజాతమ్ ॥**

# ఆయురారోగ్యములు కలుగుటకు

3 వ కాండలోని 11 వ సూక్తంలో 2 వ మంత్ర పారాయణ వల్ల, క్షయరోగం నశిస్తుంది. అపమృత్యువు తొలుగుతుంది. రాహు దశలో ఈ మంత్ర పారాయణ చాలా మేలు కలుగజేస్తుంది.

"యదక్షితాయుర్యదివా పరేతో" యదియ్మృత్యో రంతికం నీతేవ ॥ తమాహరామి నిఋతే రుపస్థా రస్పార్శ మేనం శతశారదాయ ॥

# ఆయుర్ వృద్ధికి

**శతం జీవశరదో వర్ధమానః శతం హేమంతాన్ శతముప సంతాన్ ॥ శతంత ఇద్రో అగ్నిః శతాయుషా హవిషా హార్ష మేనమ్ ॥**

# ఉత్తరేణి మూలికా సూక్తం

ఇది అపామార్గ సూక్తం. ఉత్తరేణి యొక్క సంస్కృత నామం. అపామార్గ. బొటానికల్ పేరు చైరాంతన్ ఎస్పేరా, దీనినే "దుచ్చెన చెట్టు" అంటారు. దీని రసము, కషాయము వెగటుగా, చేదుగా ఉంటుంది. మూత్రపిండములపై పని చేస్తుంది. కాయసిద్ధికి మంచిది. దీని విత్తులు బియ్యం, పాలతో వండి తిన్నచో పరిణామశూల అనే కడుపునొప్పిని పోగొడుతుంది. దీని పూత వెన్నులను కొద్దిగ పంచదార వేసి నూరి మాత్రలుగా చేసి పిచ్చికుక్క కరిచిన వారికి తినిపించిన విషము హరించును. దీని ఆకురసము లోపలి కిచ్చిన పామువిషము హరించును. ఆకులు నీళ్ళతో నూరి పలుచగా కందిరీగలు, తేనెటీగలు కుట్టినచోట రాసినచో మంట తగ్గును.

ఈ మూలికను ఈ సూక్త పఠనము చేసి సమంత్రకముగా తీసి ఉపయోగించిన సంజీవిని వలె పని చేయును.

**శుక్ర ఋషిః॥ అనుష్టుప్ ఛందః 4-17.**

**ఈశానాం త్వా భేషజానా ముజ్జేష ఆరభామహే**

**చక్రే సహస్రవీర్యం సర్వస్మా ఓషధేత్వా ।**

**సత్యజితం శపథః యావనీం సహమానాం పురఃసరాం**

**సర్వాః సమహ్వా యోషధీరితో నః పారయాదితి**

**యా శశావ శవనేన యాఘం మూరమాధదే**
**యా రసస్య హరణాయ జాతమారేభే తోకమత్తుసా**
**యాంతే చక్రురామే పాత్రేయాం చక్రనీల లోహితే**
**ఆమే మాంసే కృత్యాంయాం చక్రుస్తయా కృత్యాకృతో జహీ**
**దౌష్వప్న్యం దౌర్జీవిత్యం రక్షో అభ్వ మరాయ్యః ॥**
**దుర్ణామ్నాః సర్వాదుర్వా చస్తౌ అస్మాన్నా శయామసి**
**క్షుధామారం తృష్ణామారమగోతా మనసత్యతామ్ ॥**
**అపామార్గ త్వయావయం స్వంతదప మృజ్మహే**
**తృష్ణామారం క్షుభామారమధో ఆక్షపరాజయమ్ ॥**
**అపామార్గ త్వయావయం సర్వంతదప మృజ్మహే**
**అపామార్గ ఓషధీనాం సర్వాసామేక ఇద్వశీ**
**తేనతే మృజ్మ ఆస్థితమధ త్యగమదశ్చర ॥**

## హృద్రోగం - కామెర్లవ్యాధి నివృత్తి : 1-22

బ్రహ్మా ఋషిః ॥ సూర్యో దేవతా ॥ అనుష్టుప్ ఛందః

ఈ సూక్త పారాయణ వల్ల గుండె వ్యాధులు, కామెర్లవ్యాధి నివారణమవుతాయి. గుండెకు, జీర్ణకోశమునకు బలవర్ధకమగును.

**అనుసూర్య మదయతాం హృద్యోతో హరిమాచ తే**
**గోరోహితస్య  వర్ణేన తేనత్వా పరి దధ్మసి ॥**

పరిత్వా రోహితైర్వర్ణై ర్థీర్ఘాయుత్వాయ దద్మసి
యధాయ మరపా ఆసదధో అహరితో భువత్
యా రోహిణిర్దేవత్యా గావోయా ఉత రోహిణిః ॥
రూపం రూపం వయోవయస్తాభీష్ట్వా పరిదధ్మసి
శుకేషు తే హరిమాణం రోపణా కాసు దధ్మసి
అధో హారిద్ర వేషు తే హరిమాణం నిదధ్మసి ॥

## బొల్లివ్యాధి నివారణ సూక్తం 1-23

అధర్వ ఋషిః అసిక్ని మూలిక అనుష్టుప్ ఛందః ॥

**నక్తంజాతా స్యోషధే రామేకృష్ణే అసిక్ని చ**
**ఇదం రజని రజయ కిలాసం పలితం చయత్ ॥**
**కిలాసం చ పలితం చ నిరితో నాశయా వృషత్**
**ఆత్వాస్వో విశతాం వర్ణః పరాశుక్లాని పాతయ ॥**
**అసితం తే ప్రలయనమాస్థాన మసిత తవ**
**అసిక్న్య స్యోషధేనింతో నాశయా పృషత్ ॥**
**అస్థిజస్య కిలాసస్య తనూజస్య చయత్ త్వచి**
**దూష్యాకృతస్య బ్రహ్మణా లక్ష్మ శ్వేతమనీ నశమ్ ॥**

## కోలపొన్న మూలికా సూక్తం 2-25

కోలపొన్నను సంస్కృతంలో పృశ్నిపర్ణి అంటారు. నక్కతోక పొన్న అని కూడా అంటారు. ఇది దశమూలములో ఒకటి.

బొటానికల్ శాస్త్రీయ నామం. దూదియా లాగోపోడియాదెన్. దీని రసము, కషాయము తీపిగా యుండును. కొద్దిగా వేడి చేయును. దగ్గు, జ్వరం, దాహం, తాపం, మేహవాత నొప్పులను తగ్గిస్తుంది. కొద్దిగా తీసుకోవాలి.

**చాతన ఋషి :-** పృశ్నిపర్ణి వనస్పతి – అనుష్టుప్ 4 భురిక్. ఈ సూక్తపఠనంతో సేవించాలి.

**శంనోదేవి పృశ్నిపర్ణ్యశం నిఋత్యా అకః**
**ఉగ్రాణీ కణ్వ జంభినీ తామభక్షీ సహస్వతీం ॥**
**సహమానేయం ప్రథమా పృశ్నిపర్ణ్య జాయత**
**తయాహం దుర్ణామ్నా శిరోవృశ్చామి శకునేరివ ॥**
**అరాయ మసృ క్పావనం యశ్చసాతిం జిహీర్షతి**
**గర్భాదం కణ్వంనాశయ పృశ్నిపర్ణి సహస్యచ ॥**
**గిరిమేనాం ఆవేశయ కణ్వాన్ జీవితయోపనాన్**
**తాస్తందేవి పృశ్నిపర్ణ్యగ్నిరి వానుదహనిహిః**
**పరాచ ఏనాన్ ప్రణూద కణ్వాన్ జీవితయోపనాన్**
**తమాంసి యత్రగచ్ఛతి తత్రక్యాదో అజీగమమ్ ॥**

## స్త్రీ మనోవశీకరణ మంత్రం 2-30

తనమాటకు ఎదురుచెప్పు భార్యను అనుకూలవతిగా చేసుకొనుటకు ఈ సూక్త పారాయణ చేయాలి.

**ప్రజాపతి ఋషిః ॥ మనః అశ్వినౌ, ఓషధి దంపతి అనుష్టుప్ పధ్యాపంక్తిః భురిక్ ఛందస్సులు**

**మం॥ యధేదం భూమ్యా అధీతృణం వాతో మధాయతి**
**ఏవామధ్నామాతే మనోయధామాం కామిన్యసో**
**యధామన్నాపగా అసః**
**సంచేన్న యాధో అశ్వినా కామినా సం చ వక్షథః**
**సంవాం భగాసో అరమత్ సంచిత్తాని సముమ్రతా ॥**
**యత్ సుపర్ణా వివక్షనో అనమీవా వివక్షవః**
**తత్రమే గచ్ఛతాద్ధవం శల్యఇవ కల్మలం యధా ॥**
**యదంతరం తద్బాహ్యం యద్బాహ్యం తదంతరం**
**కన్యానాం విశ్వరూపాణాం మనోగృభాయౌషధే ॥**
**ఏయమగన్ పతికామా జనికామోహ మాగమమ్**
**అశ్వః కనిక్రదద్ యధా భగేనాహం సహాగమమ్ ॥**

# వ్యాపార వృద్ధికి

వాణిజ్య సూక్తం 3-15 అధర్వ ఋషిః ॥ విశ్వదేవా త్రిష్టుప్ ఛందః॥ ఈ మంత్రజపం వల్ల వ్యాపారములో అభివృద్ధి కలుగుతుంది.

ఇంద్రమహం వణిజం చోదయామి సనైతు పురేతానో అస్తు ॥ నుదన్నరాతిం పరిపంధినం మృగం స ఈశానో ధనదా అస్తుమహ్యామ్ ॥

మరొక మంత్రం

**మం॥ శునం నో అస్తు ప్రపణో విక్రయశ్చ ప్రతిపణ ॥ ఫలినం మా కృణోతు ॥ ఇదం హవ్యం సంవిదానౌ జుషేధాం శునం నో అస్తు చరిత ముత్థితంచ ॥**

మరొక మంత్రం

**మం॥ యేన ధనేన స్రవణం చరామి ధనేనదేవా ధనమిచ్ఛ మానః తన్మే భూయోః భవతు మాకనీయోగ్నే సాతఘ్నో దేవాన్ హవిషా నిషేధః ॥**

# వ్యవసాయ వృద్ధికి 3-17

**కృషిసూక్త మంత్రం॥ విశ్వామిత్ర ఋషిః సీతా దేవతా అనుష్టుప్ ఛందః ॥**

నాగలితో దున్నునపుడు, విత్తనాలు చల్లుతున్నప్పుడు ఈ మంత్రం చదవాలి.

**"సీరా యుంజంతి కవయో యుగా వి తన్వ తే పృధక్ ధీరా దేవేషు సుమ్నయౌ యునక్త సీ రావియుగా తనోత కృతే యోనో వపతేహ బీజం ॥ విరాజ స్నుష్టిః సభరా అసన్నో నేదీయ ఇత్ సృణ్యః పక్వయా యవన్**

# తేజస్సు పొందుటకు 3-22

**వశిష్ఠ ఋషిః బృహస్పతి ర్దేవతా ॥**

ఈ మంత్రజపంవల్ల ముఖవర్ఛస్సు పెరుగుతుంది. ఆకర్షణగా ఉంటుంది.

**"యేన హస్తీవర్చసా సంబభూవ యేన రాజా మనుష్యే ష్వప్సంతః ॥ యేనదేవా దేవతామగ్ర ఆయన్ తేన మామద్య వర్చసాగ్నే వర్చస్వినం కృణు ॥**

# కుటుంబంలో ఐకమత్యం 3-30

**అధర్వ ఋషిః ॥ చంద్రమాః ॥ అనుష్టుప్ ॥**

ఈ మంత్రముల పారాయణ వల్ల కుటుంబంలో ఆప్యాయత వృద్ధి కలుగును.

**సహృదయం సాంమనస్య మవిద్వేషం కృణోమివః**
**అన్యో అన్యమభీ హర్యత వత్సం జాతమివా ఘ్న్యాః ॥**
**అనువ్రతః పితుఃపుత్రో మాత్రాభవతు సంమనాః**
**జాయాపత్యే మధుమతీం వాచం వదతు శాంతివాం**
**మాభ్రాతా భ్రాతరం ద్విక్షన్మా స్వసారము తస్వసా**
**సమ్యంచః సవ్రతాభూత్వా వాచంవదత్ భద్రయా**
**యేనదేవా న వియంతి నో చ విద్విషతే మిధః**
**తత్కృణ్మో బ్రహ్మావోగృహే జంజ్ఞానం పురుషేభ్యః ॥**

# వాజీకరణం 4-4

ఈ సూక్త పారాయణ వల్ల, ఓషధి రససేవనం వల్ల పురుషాంగ వృద్ధి, వీర్యవృద్ధి కలుగుతాయి.

**అధర్వ ఋషిః ॥ సూర్య, ప్రజాపతి, ఇంద్ర, ఆపః,సోమః అగ్ని, సరస్వతీ బ్రాహ్మణస్పతి దేవతాః ॥ అనుష్టుప్ 4 పరిఉష్ణిక్, 6-7 భురిక్ ఛందాంసి.**

యంత్వా గంధర్వో అఖనద్ వరుణాయ మృతభ్రజే
తాంత్వావయం ఖనామస్యోషధిం శేఫహర్షిణీమ్ ॥
ఉదుషాఉదు సూర్య ఉదిదం మామకం వచః
ఉదేజతు ప్రజాపతిర్వృషా శుష్మేణ వాజినా ॥
యథాస్మ తే విరోహితోభి తప్తమివానతి
తత స్తే శుష్మవత్తర మియం కృణోత్వోషధిః ॥
ఉచ్చు ష్మోషధీనాం సారఋషభాణామ్
సంపుం సామింద్ర వృష్ణ్యమస్మిన్ ధేహితనూవిశన్ ॥
అపాంరసః ప్రథమజోథో వనస్పతీనామ్
ఉతసోమస్య భ్రాతాస్సుతార్మమసి వృష్ణ్యమ్ ॥
అద్యాగ్నే అద్యసవితురద్యదేవి సరస్వతి
అద్యాస్య బ్రహ్మణస్పతే ధనురివా తానయావసః ॥
అహంతనోమి తేవసోఅధి జ్యామివ ధన్వని
క్రమస్వర్శ ఇవరోహిత మనవగ్లాయతా సదా ॥
అశ్వన్యా శ్వతరస్యాజస్య పేత్వస్య చ ॥
అథ ఋష భస్యయే వాజాస్తానస్మిన్ ధేహితనూవిశన్

## నిద్ర కలిగించు సూక్తం 4-5

ఈ సూక్త జపం వల్ల మానవుని అంతరంగం ప్రశాంతమై బీజాక్షర ధ్వనితరంగాలు సుఖనిద్రను కలుగజేస్తాయి. సముద్రం

నుండి వేయి కొమ్ములు గల వృషభం పైకి లేచిందని ప్రతీకాత్మకంగా సబ్‌కాన్షస్ మైండ్ వర్ణన ఇందులో చేయబడింది. గ్రీకులు చెప్పే రెక్కల గుర్రం (పెగాసస్) మన వేదాల్లో చెప్పిన పేదఘూశ్వమే.

**బ్రహ్మ ఋషి । స్వాపదం, వృషభః ॥ అనుష్టుప్ ఛందః**
**సహస్ర శృంగో వృషభో యఃసముద్రా దుదాచరత్**
**తేనా సహస్యనావయం నిజనాన్ త్స్వాపయామసి ॥**
**నభూమింవాతో ఆతివాతినాతి పశ్యతి కశ్చన**
**స్త్రియశ్చ సర్వాఃస్వాపయ శునశ్చేంద్ర సఖాచరన్**
**ప్రోష్ఠేశమూ స్తల్పేశయా నారీర్యా వహ్యాశీవరీః ॥**
**స్త్రియోయోః పుణ్య గంధయస్తాఃసర్వాః స్వాపయామసి**
**ఏజ దేజగ్రభం చక్షుః ప్రాణమజగ్రభమ్**
**అంగాన్య జగ్రభం సర్వారాత్రీణా మతిశర్వరే ॥**
**య ఆస్తే యశ్చరతి యశ్చతిష్ఠన్ విపశ్యతి**
**తేషాం సదధ్మో అక్షీణి యధేదం హర్మ్యం తథా**
**స్వప్తుమాతా స్వప్తుపితా స్వప్తు శ్వాస్వపు విశ్పతిః**
**స్వపంత్వస్యైజాతయః స్వప్త్వయమభితో జనః ॥**
**స్వప్న స్వప్నాభీ కరణేన సర్మం నిష్వాపయా జవిః**
**ఓత్సూర్య మన్యాన్ త్స్వాపయావ్యుషం**
**జాగృతా దహమింద్ర ఇవారిష్టో అక్షితః ॥**

# రోహిణి మూలికా సూక్తం 4-12

రోహిణీ మూలికను, మాంసరోహిణీ అంటారు. దీని శాస్త్రీయ నామం సోయామిబా ఫేబ్రిఫిగా. ఇది వగరు, కారం, రుచి గలది. రక్తపైత్యం హరిస్తుంది. స్త్రీ మర్మావయవరోగం పోగొడుతుంది. శూల, మూలవ్యాధులను తగ్గిస్తుంది. విరేచన బద్ధం, వీర్యవృద్ధి చేయును.

**ఋభుః ఋషిః ॥ రోహిణి వనస్పతిః ॥**
**అనుష్టుప్ ఛందః రోహిణ్యసి రోహణ్య స్థ్నశ్ఛిన్నస్య**
**రోహణి రోహయేద మరుంధతి॥**
**యత్తేరిష్టం య త్తేద్యుత్తమస్తివేష్టంత ఆత్మని**
**ధాతాతద్ భద్రయా పునః సందధత్ పరుషా పరుః**
**సంతే మాంసస్య విస్రస్తం సమస్థ్వపి రోహతు**
**లోమలోమ్నా సంకల్పయాత్వ చా సంకల్పయాత్వచం**
**అసృక్ తే అస్తిరోహతుచ్ఛిన్నం సంధేహ్యోషధే ॥**
**స ఉత్తిష్ఠ ప్రేహి ప్రద్రవ రథః సుచక్రః సుపవిః**
**సునాభిః ప్రతిం తిష్ఠోర్వః ॥**
**మదికర్తం పతిత్వా సంశశ్రే యదివాశ్మా ప్రహృతో జఘాన**
**బభూ రథస్యేవాంగాని సందధత్ పరుషా పరుః ॥**

## జయ ప్రాప్తికి 5-3

ఈ మంత్రజపం వల్ల కార్యసిద్ధి, అధికారుల అనుకూలత, అభివృద్ధి కలుగుతాయి.

**బృహద్దివో అధర్వ ఋషిః అగ్నిర్దేవతా ॥**
**త్రిష్టుప్ ఛందః మమాగ్నే వర్చో విహవేష్వస్తు వయం**
**త్వేంధా నా స్తవ్యం పుషేమ ॥ మహ్యాం సమంతా**
**ప్రదిశశ్చ స్రస్త్వయా ధ్యక్షేణ పృతనా జయేమ ॥**

## పాము మంత్రం 5-13

ఈ మంత్ర పురశ్చరణ వల్ల పాముకాటు విషం తొలగిపోతుంది.

**గురుత్మాన్ ఋషిః ॥ తక్షకో దేవతా జగతీ ఛందః॥**
**మం॥ దదిర్విమహ్యాం వరుణో దివః కవిర్వచోభి రుగ్రైర్ని రిణామి తే విషమ్**
**ఖాతమఖాతముత సక్తమగ్ర భమిరేవ ధన్వన్ ని జజాసతే విషమ్ ॥**

## విషహరణ మంత్రం మరొకటి

**మం॥ తాబువం నతాబువం న ఘేత్ త్వమసి తాబువమ్ ॥**
**తాబువేనా రసం విషమ్ ॥**

## రోగశాంతికి

ఈ సూక్తం పారాయణ చేసి మంత్రజలం సేవించినచో సకల రోగములు ఉపశమించును. రోగతీవ్రత తగ్గి, క్రమేణా ఆరోగ్యము కలుగును.

విశ్వామిత్ర ఋషిః ॥ మధులా వనస్పతిః ॥ అనుష్టుప్ ఛందః
**4** పురస్తాద్ బృహతీ, **5–7–9,** భురిక్ ఛందాంసి

ఏకాచమే దశచమేఽ పవక్తార ఓషధే
ఋతుజాత ఋతావరి మధుమే మధులాకరః ॥
ద్వేచమే వింశతిశ్చమేఽ పవక్తార ఓషధే
ఋతుజాత ఋతావరి మధుమే మధులాకరః ॥
తిస్రశ్చ మే త్రింశచ్చమేఽ పవక్తార ఓషధే
ఋతుజాత ఋతావరి మధుమే మధులాకరః ॥
చతస్రశ్చ మే చత్వారింశ్చమేఽ పవక్తార ఓషధే
ఋతుజాత ఋతావరి మధుమే మధులాకరః ॥
పంచ చ మే పంచాశచ్చమేఽ పవక్తార ఓషధే
ఋతుజాత ఋతావరి మధుమే మధులాకరః ॥
షట్ చ మే షష్టీశ్చమేఽ పవక్తార ఓషధే
ఋతుజాత ఋతావరి మధుమే మధులాకరః ॥
సప్త చ మే సప్తతిశ్చమేఽ పవక్తార ఓషధే
ఋతుజాత ఋతావరి మధుమే మధులాకరః ॥
అష్ట చ మే అశీతిశ్చమేఽ పవక్తార ఓషధే
ఋతుజాత ఋతావరి మధుమే మధులాకరః ॥
నవ చ మే నవతిశ్చమేఽ పవక్తార ఓషధే
ఋతుజాత ఋతావరి మధుమే మధులాకరః ॥

దశ చ మే శతంచమేః పవక్తార ఓషధే
ఋతుజాత ఋతావరి మధుమే మధులాకరః ॥
శతం చ మే సహస్రం చాపపక్తార ఓషధీ
ఋతుజాత ఋతావరి మధుమే మధులాకరః ॥

# నూతన గృహంలో నేతితో హోమం 5-26

ఈ సూక్తంతో కొత్త ఇంట్లో వాస్తోష్పతికి హోమం చేస్తే సకల సంపదలు కలుగుతాయి. ఏడాదికి ఒకసారి ఈ హోమం చేస్తే మరీ మంచిది.

**బ్రహ్మ ఋషిః ॥ వాస్తోష్పత్తి ర్దేవతా ॥**

**మం॥ యజూంషి యజ్ఞేసమిధః స్వాహాగ్నిః ప్రవిద్యా నిహవో
యునక్తు దేవః సవితా ప్రజానన్నస్మిన్ యజ్ఞే మహిషః స్వాహా
ఇంద్రం ఉక్థమద్యాన్యస్మిన్ యజ్ఞే ప్రవిద్వాన్ యునక్తు
సుయుజః స్వాహా॥ ప్రైషాయజ్ఞే నివిదః స్వాహా॥
శిష్టాః పత్నీభిర్వహ తేహ యుక్తాః ఏయమగన్ బర్హిషా
ప్రోక్షణి భీర్యజ్ఞం తన్వానాతః స్వాహా విష్ణుర్యునక్తు బహుధా
తపాంశ్యస్మిన్ యజ్ఞేసుయజ్ఞః స్వాహా త్వషా యునక్తు
బహుధాను రూపా అస్మిన్ యజ్ఞే సుయుజః స్వాహా ॥
భగోయునక్వ శిషోస్వస్మా అస్మిన్ యజ్ఞేప్రవిద్వాన్ యునక్తు
సుయుసః సోమోయునక్తు బహుధా సయాంస్యస్మిన్ యజ్ఞేసు
యుజః స్వాహా, ఇంద్రో యునక్తు బహుధా వీర్యాణ్యస్మిన్
యజ్ఞేసు యజః స్వాహా ॥**

**అశ్వినా బ్రహ్మణా యాతమర్వాంచౌ వషట్కారేణ యజ్ఞం వర్ధయతౌ, బృహస్పతే**
**బ్రహ్మణా యాహ్య ర్వాంగ్ యజ్ఞో అయం స్వరిదం**
**యజమానాయ స్వాహా ॥**

## స్త్రీ వశీకరణం 6-8

**జమదగ్ని ఋషిః కామాత్మా ॥ పధ్యాపంక్తి చ్ఛదః** యదా వృక్షంలిబుజా సమంతం సరిషస్వజే ॥ ఏవాపరిష్వ జస్వమాం యధామాం కామన్యసో మధామన్నాపగా అసః ॥

## నేత్రరోగ నివృత్తి 6-16

**శౌనక ఋషిః చంద్రమా ॥**

అబయో అనాబయో రసస్త ఉగ్ర అబయో ।
ఆతే కరంభ మద్మసి ॥
త్ విలికే వేలయా వాయమైలబ ఐలయాత్ ॥
బభ్రుశ్చ బభ్రుకర్ణశ్చా పేహి నిరాల ॥
అలసాలాసి పూర్వాసి సిలంజాలా స్యుత్తరా ॥
నీలా గలాసాలా ॥

## ఈర్ష్యా నాశనం

అధర్వ ఋషిః ॥ అనుష్టుప్ ఛందః ॥

ఈ మంత్రజపం వల్ల ఈర్ష్య నశిస్తుంది.

**అదో యత్తేహృది శ్రితం మనస్కం పతయిష్ణుకం ।**
**తత స్త ఈర్ష్యాం ముంచామి నిరుష్మాణం దృ తేరివ ॥**

## చర్మరోగ నాశకం 6-26

బ్రహ్మాఋషిః ॥ అనుష్టుప్ ఛందః ॥
అవ మాపాప్మన్త్సృ జపశీసన్ మృదయాసిసః
ఆ మా భద్రస్యలోకే సాప్మన్ ధేహ్యా విహ్నుతమ్ ॥
యోనః పాప్మన్ న జహాసి తముతా జహి మోవయం
పథామను వ్యావర్తనేన్యం పాప్మాను పద్యతామ్ ॥
అన్య త్రాస్మన్న్యుచ్యతు సహ్నసాక్షో అమర్త్యః
యం ద్వేషామ తమృచ్ఛతు యముద్విష్మ స్త మిజ్జహి ॥

## గోమంత్రం 6-31

**ఉపరి బభ్రుః॥ గౌః దేవతా-గాయత్రీ క్ష్మీందః ఆయం గౌః పృశ్ని రక్రమీ దసదన్మాతరం పునః పితరం చ ప్రియన్ త్స్వః**

## జల చికిత్స 6-57

**శంతాతి ఋషిః రుద్రః అనుష్టుప్ పథ్యాబృహతీ**
**ఇదమిద్ వా ఉ భేషజమిదం రుద్రస్య భేషజం**
**యేనేషు మేక తేజారా శతశల్యామపజ్ర వత్**

**జాలాషే ణాభీషించతజాలాషే ణోప సించత**
**జాలాషముగ్రం భేష జం తేన నో మృడజీవసే ॥**
**శంచనో మయశ్చనో మాచనః కించనామమత్**
**క్షమారపో విశ్వంనో అస్తుభేషజం సర్వంనో అస్తుభేషజం॥**

## కుష్టురోగ నివృత్తికి 6-95

**భృగ్వంగిరాః ॥వనస్పతి ॥ అనుష్టుప్ ఛందః**

**మం॥ అశ్వత్థో దేవసదన స్తృతీయ స్వామితో దివి**
**తత్రామృతస్య చక్షణం దేవాః కుష్టమవన్వత**
**హిరణ్యయీ నౌరచర ద్ధిరణ్య బంధనా దివి**
**తత్రామృతస్య పుష్పందేవాః కుష్టమవన్వత ।**
**గర్భో అస్యోషధీనాం గర్భో హిమవతా ముత**
**గర్భో విశ్వస్య భూతస్యేమంమే అగదం కృధి ॥**

## పిప్పలీ ఔషధం 6-95

దీనిని తెలుగులో పిప్పళ్ళు అంటారు. శాస్త్రీయ నామం పైపర్ లోంగమ్. ఇది కారంగా, సువాసనగా ఉంటుంది. కొద్దిగా వెచ్చచేసిన శుద్ధియగును. జఠరదీప్తి, వీర్యవృద్ధి కలిగించును. వాతము, సర్ప విషం, దగ్గు, క్షయ, ఎక్కిళ్ళను తగ్గించును. గర్భవాతం పోగొట్టును. గర్భిణుల కివ్వరాదు. దీనికి విరుగుడు శొంఠి చూర్ణము కలిపిన నిలవనీళ్ళు.

అధర్వ ఋషిః ॥ ఆయుః అనుష్టుప్ ఛందః ॥
పిప్పలీ క్షిప్త భేషజ్యా తాతివిద్ధ భేషజీ ।
తాందేవాః సమకల్ప యన్నియం జీవితవా అలం ॥
పిప్పల్యః సమవదంతాయతీ ర్జనసాదధి
యంజీవ మశ్న వామహైనస రిష్యాతి పూరుషః ॥
అసురాస్త్వా న్యఖన్ తేవాస్త్వోదపవన్ పునః
వాతీకృతస్య భేషజీ మధో క్షిప్తస్వ భేషజీమ్ ॥

## మానసిక రుగ్మత నివృత్తి 6-111

ఈ సూక్త పారాయణ జలం సేవిస్తే మనోవ్యాధులు, పిచ్చి, డిప్రెషన్ వంటి వ్యాధులు తగ్గుతాయి.

**అధర్వ ఋషిః అగ్నిః అనుష్టుప్ । పరానుష్టుప్**

**ఇమం మే అగ్నే పురుషం ముముగ్ధ్యయంయో**
**బద్ధః నుధతోలాలపీతి**
**అతోధి తే కృణవద్ భాగధేయం యదా నున్మదితో సితి ॥**
**అగ్నిష్టే నిశమయతు మదితే మన ఉద్యుతం**
**కృణోమి విద్వాన్ భేషజం యధానున్మది తోససి ॥**
**దేవైన సాదున్మదిత మున్మత్తం రక్షసస్పరి**
**కృణోమి విద్వాన్ భేషజం యదానున్మదితో సతి ॥**
**పుస్త్వా దుర్విశ్వే దేవా యధానున్మదితోఽ ససి ॥**

## ఋణబాధా నివృత్తి 7-12

కౌశిక ఋషిః ॥ అగ్నిః దేవతా । త్రిష్టుప్ ఛందః

**యద్ధస్తాభ్యాం చక్రువ కిల్బిషాణ్య క్షుణాం గత్నుముప లిప్సమానాః ॥ ఉగ్రంపశ్యే ఉగ్రజితౌ తదద్యాప్స రసావను దత్తా మృణంనః ॥**

**ఉగ్రంపశ్యే ర్నాష్ట్రభృత్ కిల్బిషాణియ దక్షవృత్త దత్తం న ఏతత్ ఋణాన్నో నర్ణమెర్త్సమానో యమస్య లోకే అధిరజ్జురాయత్ యస్మా ఋణం యస్యజాయా ముపైమి యంమాచమనో అభ్యైమి దేవాః ॥ తేనాచం వాదిషుర్మోత్తరాం మద్దీనపత్నీ ఆప్సరసావధీతమ్॥**

## సభావశ్యం 7-12

ఈ సూక్త పారాయణ వల్ల జనవశీకరణం, ఆకర్షణ, సభలో గౌరవం, సంఘంలో పలుకుబడి పెరుగును.

**శౌనక ఋషిః ॥ సభా -పితరః ॥ ఇంద్రః - మనః**

**అనుష్టుప్ భురిక్ - త్రిష్టుప్ ఛందాంసి**

**సభాచమాస మితశ్చాపతం ప్రజాపతేర్దుహతరౌ సంవిదానే ॥ యేనా సంగచ్ఛా ఉపమాస శిక్షాచ్ఛారు వదాని పితరః సంగతేషు॥**

విద్మ తే సభేనామ నరిష్టా నామవా అసి
యేతేకే చ సభాసదస్తే మే సంతుసవాచసః ॥
ఏషామహం సమాసీ నానాం వర్చో విజ్ఞాన మాదదే ః
అస్యాః సర్వస్యాః సంసదో మామింద్ర భగినంకృణు ॥
యద్ వో మనః పరాగతం యద్ బద్ధమిహ వేహవా
తద్వఆ వర్తయామసి మయి వో రమతాం మనః ॥

## ధనప్రాప్తి 7-17

భృగు ఋషిః ॥ ధాతా ॥ గాయత్రీ ఛందః ధాతా దధాతు నోరయి మీశానో జగత్పతిః ॥సనః పూర్ణేన యచ్ఛతు ॥

ఈ మంత్రం 24 లక్షలు జపించినచో ధనవంతుడగును.

## విష్ణు అనుగ్రహం 7-26

మేధాతిథి ఋషిః ॥ విష్ణుర్దేవతాః । త్రిష్టుప్ ఛందః విష్ణోర్ను కంప్రావోచం వీర్యాణి యంపార్థివాని విమమేర జాంసి ॥ యో అస్కభాయా దుత్తరం సధస్థం విచక్రమాణస్త్రే ధోరుగాయః ॥

బుధవారం రోజున ఈ మంత్రం జపిస్తే విష్ణు అనుగ్రహం కలుగుతుంది. బుధ దశాంతర్దశలు జరుగుచున్నవారు ఈ మంత్ర జపం వల్ల శుభాలు పొందుతారు. ధనవృద్ధి, కీర్తి ప్రతిష్టలు కలుగుతాయి.

## జూదంలో జయప్రాప్తి 7-50

అంగిరః ఇంద్రః అనుష్టుప్

యధావృక్ష మశనిర్వి శ్వాహా హంత్యప్రతి
ఏవాహమద్య కితవానక్షైఃవధ్యా సమప్రతి
కూతం మే దక్షిణహస్తే జయోమె సవ్య ఆహితః
గోజిత్ భూయాసమస్వజిద్ ధనంజయో హిరణ్యజిత్ ॥

## శ్రేష్ఠతా ప్రాప్తి 7-51

**అంగిరా ॥ ఇంద్రా బృహస్పతీ ! త్రిష్టుప్**

బృహస్పతిర్నః పరిపాతు పశ్చాదుతో త్తరస్మా దధరాదధాయోః । ఇంద్రః పురస్తాదుత మధ్యతో నః సఖీభ్యో వరీయః కృణోతు ॥

## శాపమోచనం 7-59

ఈ మంత్రజపం వల్ల శాపములు తొలగును.

యోనః శాపావ శపతః శపతో యశ్చనః శపాత్ వృక్ష ఇవ విద్యుతాహత ఆమూలాదనుష్యతు ॥

## అమావాస్యా సూక్తం 7-79

**అధర్వ ఋషిః అమావాస్యా త్రిష్టుప్ జగతీ ॥**

అమావాస్య రోజు పారాయణ చేస్తే పితృదేవతల యొక్క అనుగ్రహం కలుగుతుంది.

**యత్తేదేవా అకృణ్వన్ భాగధేయ మమావాస్యే సంవసంతో మహిత్వా తేనానో యజ్ఞ పిపృహి విశ్వవారే రయిం నోధేహి సుభగే సువీరం । అహమేవా స్మ్యమావాస్యా మామా వసస్తి సకృతో మయిామే ॥ మయిదేవా ఉభయే సాధ్యాశ్చేంద్ర జ్యేష్టాః సమ గచ్ఛంత సర్వే ॥ ఆగన్ రాత్రీ సంగమనీవ సూనామూర్జం పుష్పం వస్వా వేశయంతీ ॥ అమావాస్యా యైహవిషా విధేమోర్జం దుహానా పయషా న ఆగన్ ॥ అమావాస్యే న త్వ దేతాన్యన్యో విశ్వరూపాణి పరిమూర్జజాన యత్ కామాస్తే జుహమస్తన్నో అస్తువయం స్యామ పతయో రయీణామ్॥**

## పూర్ణిమా సూక్తం 7-80

**అధర్వ ఋషిః । పౌర్ణమాసీ ॥ త్రిష్టుప్ - అనుష్టుప్**

పున్నమిరోజున పారాయణ చేస్తే అమ్మవారి అనుగ్రహం కలుగుతుంది.

**పూర్ణాపశ్చాదుత పూర్ణా పురస్తాదున్మధ్యతః పౌర్ణమాసీ జిగాయ తస్యాందేవైః సంవసన్తో మహిత్వా నాకస్య పృష్టే సమిషా మదేమ వృషభం వాజినం వయం పౌర్ణమాసం యజామహే సనోద దాత్వక్షితాం రయిమను పదస్వతీం ॥ ప్రజాపతే నత్వ దేతాన్యన్యో విశ్వారూపాణీ పరిమూర్జజా ॥ యత్ కామాస్తే జుహుమ స్తన్నో అస్తువయం స్యామ.**

పతయోరయీణామ్ । పౌర్ణమాసీ ప్రథమా యజ్ఞి యాసీ
దహ్నాం రాత్రీణామతి శర్వరేషు ॥ యేత్వాం యజ్ఞైః యజ్ఞియే
అర్ధయస్త్వమీతే నీకే సుకృతః ప్రవిష్టాః ॥

## ఇంద్రానుగ్రహం 7-86

**అధర్వ ఋషిః ॥ ఇంద్రః త్రిష్టుప్**

త్రాతారమింద్ర మవి తారమిద్రం హవే పే సుహవం శూర మింద్రం ॥ హవేమ శక్రం పురుహూత మింద్రం స్వస్తి న ఇంద్రో మఘవాన్ కృణోతు ॥

## దుఃస్వప్న శాంతి 7-101

**యమః దుఃస్వప్న నాశసం ॥** అనుష్టుప్ ॥ యత్
స్వప్నే అన్న మశ్నామి నప్రాత రధిగమ్యతే ॥
సర్వం తదస్తుమే శివం నహితద్ దృశ్యతే దివా ॥

పీడకలలు వచ్చిన రోజున ఈమంత్రం ఉదయాన్నే 108సార్లు జపించాలి.

## పరస్త్రీని పొందిన పతి వశీకరణం 6-130

స్మర సూక్తం

ఈ సూక్తం 8000 సార్లుగానీ, 800 సార్లుగానీ జపించి, తెల్లవార్లు అభిమంత్రించి, భర్త నడుచు స్థానములో చల్లినచో అతడు

పరస్త్రీ యందు విరక్తిచెంది, స్వభార్యయందు ఆకర్షితుడై యుండును. బ్రాహ్మణుల ద్వారా ఉపాసకుల చేత చేయించిననూ సిద్ధించును.

**అధర్వాంగిరాః ॥ స్మరోదేవతా ॥ అనుష్టుప్ ॥ విరాట్**

రధజితాం రాధజితేయీనా మప్సరసా మయం స్మరః
దేవా ప్రహణుత స్మరమసౌ మామను శోచతు ॥
అసౌమే స్మరతాదితి ప్రియోమే స్మరతాదితి
దేవా ప్రహణుత స్మరమసౌ మామను శోచతు ॥
యధామమ స్మరాదసౌ నాముష్యాహం కదాచన
దేవా ప్రహణుత స్మరమసౌ మామను శోచతు ॥
ఉన్మాదయత మరుత ఉదంతరిక్ష మాదయ
అగ్న ఉన్మాదయా త్వమసౌ మామను శోచతు ।

## స్మరసూక్తం (2) 6-131

**ఆధర్వాంగారాః ఋషయః స్మరః । అనుష్టుప్ ఛందః**

నిశీర్షతో నిపత్తతో అధ్యో నితిరామితే
దేవాః ప్రహిణుత స్మరమసౌ మామను శోచతు ॥
అనుమ తేన్విదం మన్యస్వాకూళే సమిదం నమః
దేవా ప్రహణుత స్మరమసౌ మామను శోచతు ॥
యద్ధావసి త్రియోజనం పంచయోజన మాశ్వినం
తత స్త్వం పునరాయసి పుత్రాణాం నో అసః పితా ॥

ఈ సూక్తము కూడా ముందు సూక్తము చెప్పిన ప్రయోజనమునే కలిగించును. పుత్రవంతురాలైన స్త్రీని విడిచి, అన్యస్త్రీ ఆసక్తుడైన వానియందు ఇదిబాగా పని చేస్తుంది.

## గౌః -9-7

గోమాతను విశ్వరూపంగా, ఈ సూక్తంలో ఉల్లేఖించారు. గోదానం చేయునపుడు ఈ సూక్తం పఠించాలి.

**బ్రహ్మా ఋషిః ॥ గౌఃదేవతా ॥ వివిధాని ఛందాంసి**

ప్రజాపతిశ్చ పరమేష్ఠీ చ శృంగే ఇంద్రః శిరో
అగ్నిర్లలాటం యమః కృకాటం
సోమోరాజో మస్తిష్కో ద్యౌరు త్తరహనుః
పృధివ్య ధరహనుః ॥
విద్యుజ్జిహ్వా మరుతోదంతా రేవతీ గ్రీవాః
కృత్తి కాస్కంధా ధర్మోవహః
విశ్వం వాయుః స్వర్గలోకః కృష్ణద్రవం విదరిణి నివేష్యః
శ్యేనః క్రోడోంపర్జన్యం బృహస్పతిఃకహద్ బృదాతీః కీకసాః॥
దేవానాం పత్నీః పృష్ఠయాః ఉపసదః పశనః ॥
మిత్రశ్చ వరుణశ్చా సౌ త్వష్టాచార్యమాచ దోషణి మహాదేవో బాహుః
ఇంద్రాణి భసత్ వాయుః పుచ్ఛం పవమానోబాలాః
బ్రహ్మాచ క్షత్రంచ శ్రోణి బలమూరూ

ధాతాచ సవితా చాష్ఠీవంతౌ జంఘా గంధర్వా
అప్సరసః కుష్ఠికా అదితః శఫాః ॥
చేతో హృదయం యకృన్మేధా వ్రతంపురీతత్
క్షుత్ కుక్షిరిరా వనిష్ఠుః పర్వతాః ప్లాశయః ॥
క్రోధో వృక్కౌ మన్యురాండౌ ప్రజాశేపః ॥
నదీసూత్రీ వర్షస్య పతయస్తనా స్తన యిత్నురూధః ॥
విశ్వవ్య చాశ్మర్మౌషధయో లోమాని నక్షత్రాణి రూపం
దేవజనాగుదా మనుష్యా ఆంత్రాణ్యత్రా ఉదరమ్ ॥
రక్షాం సిలోహితమిత రజనా ఊబధ్యమ్
అభ్రం పీబో మజ్జానిధనమ్ ॥
అగ్ని రాసీన ఉత్థితోశ్వినా
ఇంద్రఃప్రాంగ్ తిష్ఠన్ యమః ॥
ప్రత్యంగ్ తిష్ఠన్ ధాతోదంగ్ తిష్ఠన్ త్సవితా
తృణాని ప్రాప్తః సోమోరాజా
మిత్ర ఈక్షమాణ ఆవృత్త ఆనందః
యుజ్యమానో వైశ్వదేవో యుక్తః ప్రజాపతి ర్విముక్త సర్వం
ఏతద్వై విశ్వరూపం సర్వరూపంగో రూపమ్ః
ఉపైనం విశ్వరూపాః సర్వరూపాః-
పశవః తిష్ఠంతి య ఏవం వేద ॥

# ప్రత్యంగిరా భద్రకాళి 10-1

**ప్రత్యంగిరా ఋషయః ॥ కృత్యా దూషణమ్ ।**

యాం కల్పయంతి వహతౌ వధూమివ విశ్వరూపాం
హస్తకృతాం చికిత్సవః ॥ సారాదేత్వ పనుదాం ఏనామ్ ।
శీర్షణ తీనుస్వతీ కర్ణినీ కృత్యాకృతా సంభృతా విశ్వరూపా
సారాదేత్వ పనుదాం ఏనామ్ ॥
శూద్రకృతా రాజకృతా స్త్రీకృతా బ్రహ్మభీఃకృతా
జాయా పత్యాను త్తేవ కర్తారం బంధ్వాచ్ఛతు ॥
అనమాహ మోషధ్యా సర్వాః కృత్యా అదూషకమ్
యాంక్షేత్రే చక్రుర్యాం గోషుయాంవాతే పురుషేషు
అధమ స్త్వదకృతే శపధః శపధీయతే
ప్రత్యక్ ప్రతిప్రహిణ్మో యధాకృత్యా కృతాహనత్
ప్రతీచీన ఆంగీరసో ధ్యక్షోనః పురోహితః
ప్రతీచీః కృత్యా అకృత్యామూన్ కృత్యాకృతా జహి ॥
యస్త్వోవాచ పరేహీతి ప్రతికూల ముదాయ్యమ్
త్వంకృత్యేభి నివర్తస్వ మాస్మాని చ్ఛో అనాగసః
యాస్తే పరూంషి సందధౌ రధస్యేవ భుర్ధియా
తంగచ్ఛ తత్రతేయ సమజ్ఞాత స్తే యంజనః

యేత్వాకృత్వా లేభిరే విద్వలా అభిచారిణః
శంభ్వీదం కృత్యాదూషణం ప్రతివర్త్మ
పునఃసరం తేనత్వా సూపయామసి ॥
యద్దుర్భగాం ప్రశ్న పితాం మృతవత్సాముపే యిమ
అపైతు సర్వం మత్పాపం ద్రవిణం మోపతిష్ఠతు ॥
యత్తే పితృభోయదదతో యజ్ఞేవా నామ జగృహుః
సందేశ్యాత్ సర్వస్మాత్ పాపాదిమామూంచ త్వౌషధీః
దేవై నసాత్ పిత్ర్యానామ గ్రాహాత్ సందేశ్యాదభి నిష్కృతాత్
ముచంతుత్వా వీరుధో వీర్యేణ బ్రహ్మణ ఋగ్భిః పయస ఋషిణామ్
యధావాతశ్చ్యావయతి భూమ్యా రేణుమంత రిక్షాచ్చాభ్రం
ఏవామత్సర్వం దుర్భూతం బ్రహ్మనుత్తమపాయతిః
అపక్రమ నానదతీ వినద్ధాగర్ధభీవ
కర్త్రూన్ నక్షస్వేతో నుత్తా బ్రహ్మణా వీర్యవతా ॥
అయంపంధాః కృత్యేతి త్వానయామోభీ ప్రహితాం ప్రతిత్వా ప్రహిణ్మః
తేనాభియాహి భంజత్యన స్వతీవ వాహినీ విశ్వరూపా కురూటినీ
పరాక్తే జ్యోతిరపధం తే ఈర్వాగన్యత్రా స్మాదయనా కృణుష్వ
నరేణేహి నవతిం నావ్యా అతిందుర్గాః స్రోత్యా మా క్షణిష్ఠా పరేహీ
వాత ఇవవృక్షాన్ నిమృణిహి పాదాయ మాగామశ్వం
పురుషమిచ్ఛమ ఏషామ్

కర్త్రూన్ నివృత్యేతః కృత్యే ప్రజాస్త్వాయ బోధయ
యాంతే బర్హిషి యాంశ్మశాసే క్షేత్రే కృత్యాంవలగ్నం నానిచఖ్నుః ॥
అగ్నేవాత్వా గార్హపత్యే భీచేరుః పాకం సంతం ధీరతరా అనాగసమ్
ఉపాహృతమను బుద్ధం నిఖాతం వైరం త్సారన్వ విదామక విదామకర్త్రం
తదేతుయత అభృతం తత్రాశ్వ ఇవ వివర్తతాం
హంతుకృత్యాకృతః ప్రజాం ॥ స్వాయసా అసయః
సంతి నోగృహే విద్మా తే కృత్యేయతిధా పరూంషి ॥
ఉత్తిష్ఠైవ పరేహీతోஉజ్ఞాతే కిమిహేచ్ఛసి ॥
గ్రీవాస్తే కృత్యే పాదౌచాపి కర్త్స్యామి నిర్ద్రవ
ఇంద్రాగ్నీ అస్మాన్ రక్షతాం యౌ ప్రజానం ప్రజావతీ ॥
సోమో రాజాధిపా మృడితా చ భూతస్యనః పతయో మృడయంతు
భవాశర్వావ స్యతాం పాపకృతే కృత్యాకృత్యే
దుష్కృ విద్యుతం దేవహేతిమ్
యద్యేయథ ద్విపదీ చతుష్పదీకృత్యా కృత్యా సంభృతా విశ్వరూపా
సేతోష్టాపదీ భూత్వా పుసః పరేహి దుచ్ఛునే ॥
అభ్యక్తాక్తా సర్వంకృతా సర్వం భరంతీ దురితం పరేహి ॥
జానీహికృత్యే మాతిష్ఠో విద్ధస్యేవ పదం నయ ॥
మృగః స మృగయుస్త్వం సత్వా నికర్తుమర్హతి ॥

ఉతహంతి పూర్వాసినం ప్రతాదాయాపర ఇష్వా ।
ఉతపూర్వస్య నిఘ్నతో నిహంత్యపరః ప్రతి ॥
ఏతద్ధిశృణు మేవచోధేహి యేయథ యస్త్వా చకార తంప్రతి
అనాగోహత్యావై భీమాకృత్యే మానోగామశ్వం పరుషం వధీః
యత్రయత్రాసి నిహితా తతస్త్వోత్థా పయామసి పర్ణాలఘీయసి భవ
యదిస్థతమసా వృతా జలేనాభిహితా ఇవ ॥
సర్వా సంలుప్యేతః కృత్యా పునః కర్త్రే ప్రహిణ్మసి ॥
కృత్యాకృతో వలగినోభి నిష్కారిణః ప్రజాం ॥
మృణాహికృత్యే మోచ్ఛిషోమూన్ కృత్యాకృతో జహి ॥
యధాసూర్యో  ముచ్యతే తమసస్పరి రాత్రిం జహాతు
కయషసశ్చ కేతూన్ ఏవాహం సర్వందుర్భూతం కర్త్రం
కృత్యాకృతా కృతం **హస్తివరణో దురితం జహామి ॥**

# హిరణ్య ధారణం 19-26

బంగారము ధరించిన ఆయుర్వృద్ధి – వర్చస్సు కలుగును. హిరణ్యము కొత్తగా ధరించునపుడు ఈ సూక్త పారాయణ చేయవలెను.

**అధర్వ ఋషిః ॥ అగ్నిః ॥ హిరణ్యంచ ॥**

అగ్నేః ప్రజాతం పరియద్ధిరణ్య మమృతందధ్రే అరిమర్త్యేషు ॥ సఏనద్ వేదస ॥ ఇదేనమర్హతి జరామృత్యుర్భవతి యోబిభర్తి

**॥ యద్ధిరణ్యం సూర్యేణ సువర్ణం ప్రజావంతో మనవః పూర్వ ఈషిరే ॥ తత్ త్వా చంద్రం వర్చసా సం సృజత్వాయుష్మాన్ భవతియో భిభర్తిః ఆయుషేత్వా వర్చసే త్వౌజిసే చబలాయచ ॥ యధా హరణ్య తేజసా విభాసాసి జనా అను ॥ యద్ వేద రాజా రాజా వరుణో వేదదేవో బృహస్పతిః ॥ ఇంద్రోయద్ వృత్రహో వేదతత్ త ఆయుష్యం భువత్ తత్తే వర్చస్వం భువత్ ॥**

# నక్షత్ర సూక్తం 19-7

జన్మనక్షత్రం రోజున ఈ సూక్తపారాయణ వలన గ్రహదోష ములు తొలగి, సుఖ-సంపదలు కలుగును. దీనిని పూర్ణిమ నాడు కూడా పారాయణ చేస్తే చాలా మంచిది.

**గార్గ్య ఋషిః 1 నక్షత్రాణి దేవతా ॥ త్రిష్టుప్, 4 భురిక్**

**చిత్రాణిం సాకం దివిరోచనాని సరీసృపాణి భువనే జనాని తుర్మిశం సుమతి మిచ్ఛమానో అహానీ గీర్భిః సపర్యామి నాశం సుహవమగ్నే కృత్తికా రోహిణి చాస్తు భద్రం మృగశిరః శమార్ద్రా పుర్వసూ సూనృతా చారు పుష్యోభాను రాశ్లేషా అయనం మఘామే । పుణ్యం పూర్వా ఫల్గున్యా చాత్ర హస్తశ్చిత్రా శివాస్వాతి సుఖోమే అస్తు రాధే విశాఖే సుహవాను రాధా జ్యేష్టా సునక్షత్ర మరిష్ట మూలం ॥ అన్నంసూర్వా రాసతాం మే పుణ్యమేవ శ్రవణః**

శ్రవిష్ఠాః కుర్వతాం సుపుష్టిం ఆమే మహచ్ఛతభిషక్ వరీయ ఆమేద్వయా ప్రోష్టపదాసు శర్మ ॥ ఆ రేవతీ చాశ్వ యుజౌ భగంమ ఆమేరయిం భరణ్య ఆవహంతు ।

## నక్షత్రాణి 19-8

ప్రయాణమై వెళ్ళునపుడు, ప్రతీరోజు ఉదయం దీన్ని 11సార్లు పఠించిన శుభఫలితములు కలుగును.

**గార్గ్య ఋషిః ॥ నక్షత్రాః దేవతాః ॥**

**యాని నక్షత్రాణి దివ్యంతరిక్షే అప్సుభూమౌ యాని నగేషుదిక్షు ప్రకల్పయంశ్చంద్రమా యాన్యేతి సర్వాణి మమైతాని శివాని సంతు ॥ అష్టావింశాని శివాని శగ్మాని సహయోగం భజంతుమే॥ యోగం ప్రపద్యే క్షేమంచ క్షేమం ప్రపద్యే యోగంచ నమో హోరాత్ర్యా భ్యామస్తుః స్వస్తితంమే సుప్రాతః సుసాయం సుదివం సమృగం సుశకునం మే అస్తు ॥ సుహవమగ్నే స్వస్త మర్త్యం గత్వా పునరాయాభినందన్ అనుహవం వరిహవం పరివాదం పరిక్షవం సర్వైర్మే రిక్తకుంభాన్ పరతాన్ సవితః సువ ॥**

❁ అధర్వవేదమునకు 5 ఉపవేదములున్నట్లు "గోపధ బ్రాహ్మణ ములో చెప్పబడినది. 1. సర్పవేదం, 2. పిశాచవేదం, 3.అసురవేదం, 4. ఇతిహాసవేదం, 5. పురాణవేదం.

అధర్వవేదములో 18 రకముల సర్పజాతులు చెప్పబడ్డాయి. 1. కైరాత (అరణ్యంలో భిల్లులుండు స్థలములో ఉంటుంది) 2. పృశ్ని (చిత్రవర్ణాలుంటాయి) 3. ఉపతృణ్య (గడ్డిలో ఉంటుంది) 4. బభ్రు (బూడిదరంగు సర్పం) 5. అసిత (నల్లగా ఉంటుంది) 6. అలీక (విషము లేనిది) 7. తైమాత (నీటిలో ఉంటుంది) 8. ఆపోదశ (ఎడారిలో ఉంటుంది) 9. సత్రాసహ (ఆక్రమణ గుణం కలది) 10. మన్యు (కోపం కలిగించు సర్పం) 11. అలిగీ (శరీరమును చుట్టుకుంటుంది. 12. విలిగీ (ఇది చుట్టుకోదు) 13. ఉరుగూలా (పెద్ద శరీరము కలది) 14. అసిక్నీ ( నల్లనిది) 15. దుద్రుషి (దద్దుర్లు కలిగించునది) 16. కర్ణా (చెవులు గలది) 17. శ్వావిత్ ( కుక్క వెతికి దీన్ని పట్టించును) 18. ఖనిత్రమా ( భూమిలో బలం చేసుకొని ఉంటుంది) వీటిలో 1నుండి 6 వరకు మహావిషము కలవి. 13 నుండి 18 వరకు విషము లేనివి.

అధర్వవేదం 5వ కాండలో "సర్పవిష" నాశకమగు సూక్తము కలదు. ముందు సర్పము కరిచిన వెంటనే గాటుపైన 4 అంగుళముల వద్ద గట్టిగా కట్టు కట్టమని చెబుతూ – డోలు, నగారా వాయిద్యములు వాయించిన విషము దిగునని చెప్పబడింది.

కరిచిన పామును చంపివేయమని అట్లు చేసినచో, సర్పవిషము విరుగునని చెప్పబడినది. సుశ్రుతము అష్టాంగ హృదయము

ఆయుర్వేద గ్రంథములలో కూడా చెప్పబడినది. 4-8 -12 అంగు ళముల పైన గట్టిగా కట్లు కట్టమని చెప్పబడింది.

అథర్వ వేదములో "తాబువ" ఓషధి సర్పవిష నాశనము చేయునని ఉల్లేఖించబడింది. దీని లక్షణములు "చేదుపుచ్చ"కు గలవు. దీనినే "కటతుంబి" అందురు. భావప్రకాశ - రాజ నిఘంటువులు దీనిని వమన కారకములుగా పేర్కొన్నారు. కామరత్న గ్రంథమందు - కటుతుంబి వేరు గోమూత్రమందు నూరి మాత్రచేసి నీడలో ఎండించి, మరల గోమూత్రములో నూరి అరచేతిమందాన సర్పం కరిచిన చోట లేపనము చేసినచో విషము హరించును.

అథర్వవేదములో "తస్తువ" అను మూలిక సర్ప విషనాశనముగా చెప్పబడింది. కానీ ఇదేమిటో తెలియదు, తిక్తకోశాతకి (చేదుబీర) లక్షణములతో సరిపోవును. కామరత్నమందు చేదుబీర కషాయములో తేనె, నెయ్యిలను సమానముగా కలిపి తాగించిన విషము హరించు నని చెప్పబడింది. నదీస్నానం, ఈత, సర్పవిషమును హరించునని అథర్వవేదములో 10వ కాండలో 4-19 నందు చెప్పబడింది.

కనుకనే నీటికట్లుకు అంతవిషం ఉండదు. ఈ సూక్తములోనే విషనాశక పంచమూలికలు చెప్పబడ్డాయి. 1. దర్భ, 2. శోచిః, 3. తరుణక, 4.అశ్వవారం, 5. పరుషవారం. తెల్లని శ్వేతఓషధులు

విషహరణములని అథర్వంలో ఉల్లేఖించబడింది. శ్వేతశబ్దము తెల్ల జిల్లేడుకు ధన్వంతరి - రాజనిఘంటువులు అర్ధము చెబుతున్నవి.

చరకసంహితలో (23-54) జిల్లేడుపూల రసము త్రాగుట వలన సర్పవిషము హరించునని చెప్పబడింది. సుశ్రుతములో కల్పస్థానం 5-18లో జిల్లేడు ఆకులను తిన్నచో సర్ప విషహరణమని పేర్కొన బడింది. కామరత్నములో సర్పము కరిచిన చోట జిల్లేడు వేరు నూరి పూత వేయమని చెప్పబడింది. జిల్లేడువేరు - పూలచూర్ణము దారిలో వేసినచో సర్పములు దరిచేరవు.

ఇంద్రుడు సర్పవిషనాశకునిగా 10-4-10 చెప్పబడ్డాడు. కైయదేవ వైద్య నిఘంటు రీత్యా ఇంద్రా యణి ఓషధికే ఇంద్ర అని పేరు. భావప్రకాశలో కామరత్నములో ఇంద్రాయణి సర్ప వినా శకముగా చెప్పబడింది. అథర్వవేదం 4-7-2 విషనాశన సూక్తంలో కరంభమూలిక (...?..) విషనాశకంగా చెప్పబడింది. దీనిని పెరుగుతో ఇచ్చిన విషము విరుగును.

**"అరసం ప్రాచ్యం విషమరసం మదుదీచ్యం**
**అభేద మథరాచ్యం కరంభేణ వికల్పతే ॥ 4-7-2**

హృదయరోగములకు హరిణ శృంగభస్మం వాడమని అథర్వణవేదంలో చెప్పబడింది.

**అను త్వా హరిణోవృషా పస్భశ్యతుర్భిక్రమీత్ ।**

**విషాణివిష్వ గుష్టితం యదస్య క్షేత్రియం హృది ॥**

**అధర్వణం - 3-7-2**

స్వప్న దోషములకు జలచికిత్స చెప్పబడింది. అపామార్గ (ఉత్తరేణి) నపుంసకత్వ దోషమును పోగొట్టును.

**ఈశానాం త్వా భేషజానాముజ్జేష ఆరభామహే ।**

**చక్రే సహస్రవీర్యం సర్వస్వా ఓషధేత్వాం ॥ 4-121**

వాజీకరణ చికిత్స ద్వారా వీర్యవృద్ధికి వృషాఓషధీ (..?...) కసికచ్చు, కేపాంచ్ చెప్పబడింది.

## వాజీకరణ సూక్తం 4-4-1

**యాం త్వా గంధర్వో అఖనద్ వరుణాయ మృతభజే**

**తంత్వావయం ఖనామస్యోధిం శేఫహర్షణిం ॥**

**ఉదుషా ఉదుసూర్య ఉదిదం మామకం వచః**

**ఉదేజతు ప్రజాపతిర్వృషా శుష్మేణ వాజినా ॥**

## పుత్రప్రాప్తికి 6-11-1

జమ్మిచెట్టుపై మొలిచిన రావిమొక్క రసం సేవించడం వల్ల పుత్రప్రాప్తి కలుగుతుంది.

**"శమీ మశ్వత్థ ఆరూఢః తత్రపుసంవనం కృతం**

**తద్ వై పుత్రస్య వేదనం తత్ స్త్రీ ష్వా భరామసి ॥**

# బొల్లి చికిత్స 1-23-2

అథర్వవేదమందు శ్వేతకుష్టు (బొల్లి) రావటానికి కారణములు చెప్పబడ్డాయి. 1. అస్థిజ – ఎముకలందు దోషము వలన 1. తనూజ – శరీరములో మాంసదోషము చేత 3 త్వచా చర్మదోషము వలన 4. దోషాచారము – ఆచారము పాటించకపోవుట వలన వచ్చును. ఇది 2 రకములు 1. కిలాస. ఇది చర్మమును వికృతము చేయును. 2. పలిత. ఇది కేవలం తెల్లమచ్చలు మాత్రమే ఏర్పడును. శ్యామా ఓషధీ (నీలి) ఈ రోగమును పోగొట్టును. అసురీ కూడా చెప్పబడింది. అసురి అనగా తెల్లవాలు రక్తస్రావము నిరోధించుటకు ఒక శిల చెప్పబడింది.

**ఇమాయాస్తే శతం హిరాఃసహస్రం ధమనీరుత ।**
**తాసాంతే సర్వాపా మహమశ్మనా బిలమప్యధాం ॥7-35-2**

ఇది తెల్ల (ఫిట్‌కిరా) అని భావించవచ్చు. విషాణకా మూలిక (మేషశృంగ్రి) మృదారుసింగి రక్తస్రావమును ఆపునని "విషాణకా నామవాఅసి పిత్రూణాం మూలాదుత్థితా వాతీకృత నాశినీ" 6–45–3 లో చెప్పబడింది. వాతరోగములను కూడా హరించునని చెప్పబడింది.

అథర్వవేదములో ఏడు ప్రాణములు, ఎనిమిది మజ్జా గ్రంధులు చెప్ప బడ్డాయి.

మజ్జాగ్రంధులు 1. గుదము 2. నాభి 3. ఉదరం 4. హృదయం 5. కంఠం 6. దవడలు 7. భ్రూమధ్యం 8. మస్తిష్కం.

**సప్త ప్రాణానష్టే మస్యస్తాంస్తే వృశ్చామి బ్రహ్మణా**
**అయా యమస్య సాదనమగ్నిదూతో అరంకృతః ॥2-12-7**

ఈ మజ్జాగ్రంధి స్థానములే యోగశాస్త్రములో షట్ చక్ర స్థానములుగా పేర్కొన్నారు.

# మృత్యుంజయం 6-13

ఇందు మూడు మంత్రములున్నవి. మృత్యువు 3 విధములు. 1. దేవవధ (దైవికముగా విపత్తువలన వచ్చునది. మంటలు, వరదలు, భూకంపములు)

2. రాజవధ (యుద్ధములు, అత్యాచారములు)

3. విశ్వవధ (ధనలోభముతో జరుగునవి). మృత్యువుకు 100 రూపములున్నవి. ఋషులు 21 విధములుగా తపస్సు వలన మృత్యువును జయింతురు. అకాలమృత్యువు నుండి రక్షించమని ఈ సూక్తములో ప్రార్థిస్తున్నారు. ఔషధులకు, బ్రాహ్మణులకు నమస్కారం.

**1. నమో దేవ వధేభ్యో నమో రాజవధేభ్యః**
**అధోయే విశ్వానాం వధాస్తేభ్యో మృత్యో నమోస్తుతే**

**2. నమస్తే అధివాకాయ పరావాకాయతే నమః**
**సుమత్యై మృత్యోతే నమో దుర్మత్యై త ఇదం నమః**
**3. నమస్తే యాతుధానేభ్యో నమస్తే భేషజేభ్యః**
**నమస్తే మృత్యో మూలేభ్యో బ్రాహ్మణేభ్య ఇదం నమః॥**

## సూర్యకిరణ చికిత్స 1-35

అథర్వవేదములో సూర్యకిరణ చికిత్స చాలా విస్తారముగా చెప్పబడింది. సూర్యకిరణములు శరీరమునకు సుఖమునిచ్చును. అమృతస్నానము వంటిది. ఉదయకిరణములు శిరోవ్యాధులను, హృదయరోగములను నివారించును.

**ఉద్యన్ ఆదిత్య రశ్మిభిః శిర్ష్ణోరోగం అనీనశః**

అంగభేదం ఆశీశమః- 9-8-22

నగ్నశరీరముపై సూర్యకిరణములు ప్రసరించిన ఆరోగ్యము కలుగును. 1-3-5

**విద్మా శరస్యపితరం సూర్యం శతవృష్ణ్యం ॥**
**తేనా తేతన్వే శంకరం పృథివ్యాం తేనిషేచనం బహిష్టే అస్తుబాలితి ॥**

సూర్యుని ఎఱ్ఱని రోహిత కిరణములు హృదయరోగమును, కామెర్లను పోగొట్టును. ఆయువు నిచ్చును. ఇది ఆవుపాల వంటిది.

**యారోహిణీ దేవత్యాగావో యా ఉతరోహిణిః ॥**
**రూపం రూపం వయోవయ స్తాభిష్ట్వా పరిదధ్మసి 1-22-3**

# మనోచికిత్స

మనోబలము చేత హృదయము, ఎముకలను ఆరోగ్య వంతముగా చేసుకొనవచ్చును. "అస్తిస్రంసం పురుస్రం సమాస్థితం హృదయామయం బలాంశం 8-14-1 సంకల్పబలము చేత ఆరోగ్యమును వృద్ధిపరచుకోవచ్చును. 5-11-1

# యజ్ఞ చికిత్స 6-83-4

నియమపూర్వకముగా ఇంటిలో యజ్ఞములు, హోమములను చేయుచున్నచో సాంక్రామిక రోగములు - వైరస్ వ్యాధులు రావు. కేన్సర్ నివారణకు (గండమాల) హోమం చెప్పబడింది.

వీహి స్వామాహుతిం జుషాణో మనస్వాహా మనసాదిదం జుహోమి 6-83-4, గుగ్గులు హోమం వలన అన్ని రోగములు నశించునని చెప్పబడింది.

**న తంయక్ష్మా అరుంధతే నైనం శపథో అశ్నుతే**
**యం భేషజస్య గుగ్గులోః సురభిర్గంధో అశ్నుతే 19-38-1**
**యద్ గుగ్గులో సైంధవం యత్ వాప్యాసి సమద్రియం**
**ఉభయో రగ్రమం నామాస్మ అరిష్టతాతయే ॥**

గుగ్గులు - సుగంధవాయువు వాతావరణమును శుభ్రపరచి ఆరోగ్యశక్తిని వృద్ధిపరుచును.

# శల్య చికిత్స 4-12-1

అథర్వవేదమునందు శల్యచికిత్స కూడా చక్కగా చెప్పబడింది. దెబ్బలు తగిలినపుడు, ఎముకలు విరిగినపుడు మాంసరోహిణీ ఓషధి నయము చేయును. మామూలు రోహిణి అనగా ఏడు ఓషధుల సమూహము. 1. మంజిష్ట, 2. కటుకి, 3. బ్రాహ్మీ, 4. తులసి, 5. హరడి, 6. హల్దీ, 7. గంభారీ. ఇవి రక్తస్రావమును నిరోధించును. వాపును తగ్గించును. భద్ర అను ఓషధి (సారిబ) లేదా అనంత మూలం. ఇవి విరిగిన ఎముకలను అతికించు శక్తి గలవి.

# కోపము తగ్గించు సూక్తము 6-43-1

అథర్వవేదములో దర్భ, భూరిమల ఓషధులు కోపమును తగ్గించునని చెప్పబడినది. కైయదేవ వైద్యనిఘంటు రీత్యా భూరిమల అంటే ఖస్ (వట్టివేళ్ళు) అని అర్థం. సింధుఫలమనే ఓషధి ఈర్ష్యను తగ్గించును. శాలిగ్రామ నిఘంటు రత్నాకరమందు సింధుఫల గుణములు భ్రాంతినాశకము, ఈర్ష్యా నాశకమని చెప్పబడినది.

**ఆయందర్భో విమన్యుకః స్వాయచరణాయ చ**
**మన్యోర్విమన్యు కస్యాయం మన్యుశమన ఉచ్యతే ॥**
**అయంయో భూరిమలః సముద్ర మవతిష్టతి**
**దర్భః పృధివ్యా ఉత్థితో మన్యుశమన ఉచ్యతే ॥**

# ఉన్మాద చికిత్స 6-111-1

మనస్సు యొక్క ఉన్మత్తత శాంతించుట కొరకు అగ్నియందు సుగంధ పౌష్టికములైన ఓషధులు వేసి ఆ ధూమం పీల్చుట వలన ఉన్మాదము తగ్గుతుంది.

**ఇమంమే అగ్ని పురుషం ముముగ్ధ్యం యోబద్ధః సుయతో లాలపీతి**
**అతోధీతే కృణవత్ భాగధేయం యదానున్మది తో సతి ॥**

# క్రిమినాశనం 4-37-1

క్రిములను నాశనము చేయు ఓషధిగా అజాశృంగి చెప్పబడినది. ఇది కాకడాశింగీ, మేధాశింగీ అని 2 రకములు. ఆజాశృంగి విషమును కూడా హరించును.

**ఏయమగ న్నోషధీనాం వీరుధాం వీర్యావతీ**
**అజశృంగ్య రాటకీ తేక్ష్ణిశృంగీ వ్యపతుః ॥**

# శతమానములు

శతపథ బ్రాహ్మణము- కాత్యాయన శ్రౌత సూత్రములలో బంగారమునకు శతమానమనే పేరు చెప్పబడింది. సాయణుడు దీనికి వ్యాఖ్య వ్రాయుచూ 100 గురువింద గింజల ఎత్తు బంగారపు బిళ్ళ అని వివరించాడు. మైత్రాయణి సంహితలో రజత శతమానములు కూడా చెప్పబడ్డాయి. మన ఆంధ్రదేశములో స్త్రీలు మంగళసూత్రము

లను శతమానములని వ్యవహరించడంలో వేదకాలం నాటి ప్రాచీనత ఉన్నది. దానిని నిలబెట్టుకోవడం ఒక గొప్పవరం. "శతం నిష్కా హిరణ్యయా" అని అథర్వంలో 20-131-5 లో నిష్కశబ్దము బంగారు బిళ్ళకు వ్యవహరించబడింది.

## అథర్వంలో ఓషధులు

**1.సోమలత:-** ఇది మూజవత్ పర్వతముపై నున్నట్లు తెలుపబడినది. అందుచేతనే దీనిని మౌజవత్ అని పిలిచేవారు. కుష్ఠ అనే ఓషధికి స్నేహితుడిగా చెప్పబడింది. "సోమస్యాసి సఖా" 5-4-7 హిమాలయముపై ఈ రెండూ లభించేవి.

**2. అపామార్గ:-** ఉత్తరేణి అని తెలుగు పేరు. అథర్వవేదంలో దీని మహత్యమును తెలుపుతూ 3 సూక్తములున్నవి. దీనివలననే దేవతలు రాక్షసులను జయించారట.

**3. పాటా:-** దీన్నే పాఠ అంటారు. తెలుగులో చిరుబొద్ది. ఇది బలవర్ధకమైనది. దీనిని తావీదులో ధరించవచ్చును. ఇంద్రుడు రాక్షసులతో యుద్ధమునకు వెళ్ళునపుడు చేతికి ధరించాడు.

**4. పిప్పలి:-** ఇది వాతరోగము, ఉన్మాదులను పోగొట్టును. గాయములను మాన్పును.

# పిప్పలీ క్షిప్త భేషజీ ఉతాతి విద్ధ భేషజీ -6-109-1

**5. పృశ్నివర్ణి:-** దీనిని తెలుగులో కొలపొన్న అంటారు. రక్తదోష ములను పోగొడుతుంది. కొందరు దీనినే లక్ష్మణగా భావిస్తున్నారు. సంతానము కలిగించును.

**6. వృషభ:-** ఓషధులు బలమును కలిగించేవిగా చెప్పబడ్డాయి.

**7. మధులా:-** వాక్ మాధుర్యమును కలిగించును.

**8. ముంజ:-** ఇది రక్తస్రావమును అరికట్టును.

**9. శర:-** ఇది రెల్లు గాయములను మాన్చును.

**10. సహస్రకాండ:-** దూర్వాగడ్డి శాపములను, దృష్టిదోషము లను పోగొట్టును.

11. దశవృక్ష దశమూలం వాతరోగములు హరించును. మరి కొన్ని ఓషధులు నామమాత్రంగానే మనకు తెలియును. ఆబ్రయు, విహ్వల, మదావతి, తౌవిలికా, అలసాల, సిలాంజలా, నీలాగలజాలా 6-11-1

ఒకచోట ఆబ్రయు వృక్షమునకు తల్లి మదావతి యని, తండ్రి విహల్ల వృక్షమని చెప్పబడినది. అంటే సంకరజాతులు ఆనాడే ఉండేవని మనము భావించవచ్చు.

# వృక్షములు - లతలు

1. అశ్వత్థం:- రావి ఇది అనేకచోట్ల వర్ణించబడినది. దీనిని దేవతల నివాసస్థానముగా "దేవసదనం" అని పిలువబడింది. 2. న్యగ్రోధం:- మఱ్ఱి, 3. మహావృక్షం, 4. శిఖండిన్:- ఇది గురువిందలత, 5. భద్ర:-ఇది లత్తురసము నిచ్చును. 6. ప్లక్ష, 7. ఖదిర -చంద్ర, 8. ధన, 9. వర్ణ-మోదుగ, 10. బిల్వమారేడు, 11. ఉదుంబరం- మేడి, 12. శింశుపా - జమ్మి, 13. వికంకత, 14. తలాశా, 15. అర్జున, 16. అఘాట, 17. కర్కరీ-కాశర, 18. బ్రాహ్మీ, 19. గగ్గులు, 20. అజశృంగి, 21. పీలా:- ఇది సుగంధ మొక్క, 22. పీలా:- దీని పండ్లను పావురములు ఎక్కువగా తింటాయట. 23. నలద:- వట్టివేరు లేదా జటామాంసి. ఇది కఫ, పైత్యములను హరించును. 24. ఔక్షగంధి:- ఇది వాజీకరణమునకు ఉపయోగపడును. 25. ప్రమందినీ:- విషహరణము. 26. అరటు:- దీని కఱ్ఱతో రథము యొక్క ఇరుసు చేయుదురు. 27. అంజన:- దీనితో కాటుక చేయుదురు. త్రికకుద్ పర్వత ప్రాంతములును యమునానది వద్ద లభించునట. 28. మధుఘ :- తియ్యనిది. ఇప్ప లేదా మోదుగ.

# కనికట్టు

అధర్వవేదములో నాలుగు విధములుగా ఇంద్రజాలము సృష్టించవచ్చునని 6-6-9 లో చెప్పబడినది.

ఇందులో 1. కళ్ళు:- కళ్ళతో భ్రాంతి కలిగించుట. ఇందు కొరకు "చక్షు" ర్మంత్రము చెప్పబడింది. దీనినే తెలుగులో కనికట్టు అంటారు. 2. మనస్సు, 3. మంత్రము, 4. తపస్సు.

**"చక్షుషోహేతే మనసోహేతే బ్రహ్మణోహేతే తపసశ్చ హేతే మేన్యామేనిర స్యమేనయస్తే సంతుయేస్మా అభ్యదాయంతి"5-6-9.**

## వశీకరణము

ఆసురి ఓషధితో భార్య తన భర్తను వశీకరణము చేసి తన అదుపులో ఉంచుకోవచ్చునని చెపుచున్నది. ఈ మూలికచేత ఇంద్రుడు దేవతలలో గొప్పవాడయ్యేనని చెప్పబడినది. సాధ్యవ్యక్తి ఎంతదూర మందున్నా ఆకర్షణ వల్ల తన దగ్గరకు వస్తాడు.

**ఇదం ఖనామి భేషజం మాంపశ్య మభిరోరుదం :**
**పరాయతో నివర్తమా యతః ॥ ప్రతినందనం 7-38 ॥**

ఈ అసురి ఓషధి గూర్చి, వైద్య శబ్దసింధు తెల్లావాలని చెబు తున్నది. సాయణుడు తన భాష్యంలో సౌవర్చలమని (సూర్యభక్తా) చెప్పాడు. వశీకరణములో శంఖపుష్టిని కూడా వశ్యమూలికగా చెప్పాడు.

## దిగదుడుపు మంత్రం - 3-9-5

దృష్టిదోషము, నరఘోష, శాపములవల్ల ఏర్పడు రోగబాధలను ఈ మంత్రముతో దిగతుడిచినా, ఊదినా నివారణమగును.

**దుష్ట్యై హిత్వా భత్స్యామి దూషయిష్యామి కాబవం ।**
**ఉదాశవో రథాఇవ శపధేభిః సరిష్యథ ॥**

## అభిచార కర్మనింద

ఇతరుల నాశనము కొరకు చేయు కృత్యా ప్రయోగములు విద్వాంసులను, నీతిమంతులైన వారిని ఏమీ చేయలేవు. ప్రయోగము చేయు మూర్ఖులే నశింతురు. అభిచారకర్మ నీచమైనదని గర్హించ బడినది. 5-31-10.

## మణులు

అథర్వవేదములో వివిధ ఓషధీమణుల ధారణ వలన శుభఫలి తములు కల్గునని, లాభములు, ఆరోగ్యము కలుగునని విపులముగా చెప్పబడినది.

**1. జంగడమణి:-** ఈ మణి గూర్చి మూడు సూక్తములున్నవి. దీనికి మరొక పేరు అంగిర. ఇదేమిటి? అన్న విషయములో విద్వాంసులలో మత భేదములున్నవి. మణి అను శబ్దము మనః అను శబ్దమునకు అపభ్రంశరూపమని కొందరి అభిప్రాయము. ఏదైనా చెట్టుయొక్క కాండమును చిన్నచిన్న ముక్కలుగా నరికి వాటిని గుండ్రముగా చేసిన వాటిని మణి అంటారు. వాటికి రంధ్రంచేసి మాలగా ధరించవచ్చు. ఆ చెట్టుకు ఏ గుణములున్నవో అవి దాని ఆకుల లోనూ, వేరులలోనూ ఉంటాయనేది ఆయుర్వేద సిద్ధాంతం.

ఈ విధంగా మనకు మంచి ఫలితాలు తలుగుతాయి. ఇవి రోగము లను దూరం చేస్తాయి.

సాయణుడు జంగిడమనగా ఒక వృక్షమని పేర్కొన్నాడు. ఏ వృక్షమో ఎవరికీ తెలియదు. కాని దీని లక్షణములు వచా ఓషధితో పోలి ఉన్నాయి. రాజనిఘంటువు, భావప్రకాశం ఇలా తెలియ చేస్తున్నాయి. ఉగ్ర గంధగుణము కలది. చేదు, వగరు, ఉష్ణవీర్యం, ఆకలి, వమనకారకములను, వృద్ధిపరచును. దద్దుర్లను కూడా పోగొట్టును. మలమూత్రములను శుద్ధి చేయును. భూతబాధ, క్రిములను పోగొట్టును. అధర్వవేదమందు జంగిడమునకు కూడా ఇవే లక్షణములు చెప్పబడినవి.

కొందరు విద్వాంసులు సోమరసంతో చేయు గుటిక అంటు న్నారు. జంగిడమణిని తావీదులా ధరించినచో ఎముకలు విరుగుట, దగ్గు, నడుమునొప్పి, నడుముకు సంబంధించిన వ్యాధులు, చర్మ రోగములను నివారించును. భుజములకు బలము నిచ్చును. కృత్యా ప్రయోగములు, అభిచారముల వలన ఏమీ ప్రమాదము కలుగదు. శతృజయము కలుగును.

**2. ప్రతిసరమణి:-** దీనిని కశ్యపఋషి తయారుచేసి ప్రచారము చేసెను. 8-5-14 దీనిని ధరించినవారికి గంధర్వ, అప్సర, మనుష్యుల కృత్యాప్రయోగములు దరిచేరవు. కవచము వలె

రక్షించును. సింహబలుడగును. మంగళప్రదము. ఈ మణిధారణ వలనే ఇంద్రుడు వృత్రాసురుని జయించెను. ఈ మణి గూర్చి కౌశిక సూత్రమునందు ఇట్లున్నది. ఇది తిలకవృక్షము వలన తయారగును. దీనిని పెరుగు,తేనెలలో మూడు రాత్రులు ఉంచవలెను. అనంతరం అభిమంత్రించి ధరించాలి.

**కశ్యపస్త్వా మసృజత్ కస్యపస్త్వా సమైరత్ ।**
**అభివస్త్వేంద్రో మానుషే బిభ్రత్ సంశ్రేషిణో జయత్ ॥**
**మణిం సహస్రవీర్యం వర్మదేవా అకృణ్వత 8-5-14**

**3. వరమణి:-** ఇది వరణవృక్షము నుండి తయారు చేయబడును. శత్రుబాధను నివారించును. దీనికి ఓషధి గుణములు కూడా కలవు. నక్షత్రకల్పమందు దీనిని ధరించిన వారికి ధైర్యము కలుగునని చెప్పబడినది.

**4. అస్తృతమణి:-** ఇది నెయ్యి, పాలు, తేనె మిశ్రమముచే తయారగును. దీర్ఘాయువు, బలము, తేజస్సులను కలుగజేయును. తయారు చేయు విధానము తెలుపబడలేదు.

**5.దర్భమణి:-** ఇది పాపమును పోగొట్టును. క్రోధము శాంతించును. శత్రునాశకము.

**6. ఔదుంబర మణి:-** మేడిచెట్టు నుండి ఏర్పడును. ధనవృద్ధి కలుగజేయును.

**7. శంఖమణి:-** ఇది జలభయము నివారించునని నక్షత్ర కల్పము నందు చెప్పబడినది. శంఖతీర్ధము వలన ఆరోగ్యము కలుగు నని, బాలురకు బలము కలుగజేయునని ఆయుర్వేద గ్రంధములలో తెలుపబడినది. మహారాష్ట్ర నందు ఎక్కువగా ఈ ప్రయోగమును చేయుదురు.

**8. శతవారమణి:-** ఇది సంతానమును కలుగజేయును. ఋషభ ఓషధిగా ఇది వర్ణించబడింది. దీని కొనభాగము పసుపురంగులో నుండును. వందరోగములను నాశనము చేయు గుణము కలది కనుక శతవారమని పేరు వచ్చినట్లు సాయణుడు తన అధర్వ వేదభాష్యమందు పేర్కొనెను. దీనికి ముళ్ళు ఉండునని తెలిపెను. భావప్రకాశ యను ఆయుర్వేద గ్రంధమునందు ఇది రెండు రకము లుగా చిన్న,పెద్దా భేదము కలిగియుండునని చెప్పబడినది. గుల్మ రోగములు అనగా మూలశంక, భగందరము వంటి రోగములను నాశనము చేయును. పుంస్త్వము కలిగించును. దీనినే శతావరి అంటారు.

**9. అభీవర్తమణి:-** కౌశికసూత్రము నందు దీనిని తయారు చేయు విధము ఇట్లు చెప్పబడినది. పంచలోహములు మిశ్రమము చేసి (బంగారము, వెండి, రాగి, ఇనుము, సీసము) త్రయోదశి దినము నుండి మూడు రోజులు పెరుగు, తేనె పాత్రలలో ఉంచి మాలగా

గ్రుచ్చి దర్భపై నుంచి హోమము చేసి ధరించాలి. నష్టద్రవ్యలాభము, పోయిన ఉద్యోగము, పదవి పునః ప్రాప్తించును.

**10. పర్ణమణి:-** ఇది మోదుగ మూలిక. తైత్తరీయ, బ్రాహ్మణ రీత్యా ఇది సోమలత నుండి జన్మించినది. నక్షత్ర కల్పము ననుసరించి ధనవృద్ధి కోరువారు ఆంగీరసీ మహాశాంతి చేసి దీనిని ధరించాలి.

**11. ఫాలమణి:-** ఇది చంద్రమూలిక. బంగారముతో కలిపి ధరించాలి. శతృనాశనం, ఇష్టవస్తుప్రాప్తి కలుగజేయును. ధారణవిధి త్రయోదశి నుండి 9 రోజులు క్షీరాధివాసముగానే పూర్వప్రకారము చేయవలెను.

**12. వైయ్యాఘ్రమణ:-** ఇది మూలికారసముచే తయారు చేయ బడును. విధానము తెలియదు. రోగనాశకం.

**13. సువర్ణధారణ:-** దాక్షాయణ హిరణ్యమును తావీదు వలె ధరించిన తేజస్సు, బలము, దీర్ఘాయువు కలుగును. స్త్రీలు బంగారు గాజులు ధరించినచో గర్భాశయము పుష్టిగా, ఆరోగ్యముగా నుండును. పుత్రులను కోరినపుడు అదితి చేతికి త్వష్ట బంగారు గాజులను తొడిగించాడు.

**శివార్పణమస్తు**

# ఉపోద్ఘాతము

"తాంత్రిక గ్రంధావళి" శీర్షికలో ఇది 4వ పుస్తకము. మహా నిర్వాణ తంత్రం. ఇందు 14 ఉల్లాసములు, 2520 శ్లోకము లున్నాయి. నిర్వాణపదమును బట్టి ఇది బౌద్ధమతానికి సంబం ధించిన దానివలె అనిపిస్తుంది. కాని అది యదార్ధం కాదు. అయితే ప్రారంభంలో "మహావీరాయ నమః అని పేర్కొనడం వల్ల, బౌద్ధ లేదా జైన దర్శనము యందు అభిమానము చేత ఆవిధముగా వ్రాశారని భావించవచ్చు. "మహానిర్వాణం" బుద్ధుని మోక్షస్థితిని తెలుపుతుంది. మిగిలిన తంత్రముల వలెనే శివ-పార్వతీ సంవాద రూపముగానే, ఈ తంత్రము చెప్పబడినది.

ఒక గ్రంధానుసారముగా తంత్రగ్రంధములు మొత్తం 192. భూమిపై కాంతిరేఖ ననుసరించి, ఆయా సంప్రదాయములలో చెప్పబడ్డాయి. విష్ణుక్రాంత భూములలో 64 తంత్రములున్నవి. ఇవి బెంగాల్ (గౌడ దేశము) నందు ప్రచారములో నున్నవి. స్వామి కృష్ణానంద ఈ విష్ణుక్రాంత తంత్ర సంప్రదాయము ననుసరించి వాటి సంగ్రహమును "తంత్రసార" అనే గ్రంధము రచించారు. రథక్రాంత సంప్రదాయములో 64 గ్రంధము లున్నవి. ఇవి నేపాల్, టిబెట్ మొదలైన దేశములలో

ప్రచారములో నున్నవి. ప్రస్తుత మహానిర్వాణ తంత్రము ఈ సంప్రదాయానికే చెందినది . యవనుల దురాక్రమణము వల్ల యోగ్యులైన శిష్యులు లభించక కొన్ని తంత్రములు నష్ట ప్రాయములైనవి. ఇందు వైదిక, తాంత్రిక, కౌళ ధర్మములు విపులముగా చెప్పబడ్డాయి. సుమారు 750 సం॥ల క్రితం వ్రాసిన "మహా నిర్వాణ తంత్రం" లిఖిత ప్రతులు, రెండు తమకు లభించినవని, వాటిననుసరించి హిందీ అనువాదము చేసినట్లు శ్రీ బలదేవప్రసాద్ మిశ్రా తెలియజేశారు.

ఈ తెలుగు అనువాదములో, ముఖ్యమైన విషయము లన్నింటినీ వ్రాయడం జరిగింది. పునరుక్తులు, వర్ణనలు వర్జించాము.

మునుపటి ఉత్సాహముతోనే ఈ పుస్తకమును కూడా ఆదరించగలరని భావిస్తున్నాను.

9-9-1999 తంత్ర జిజ్ఞాసువు

కాకినాడ. **మేడవరపు సంపత్కుమార్.**

శ్రీ మహాగణాధిపతయే నమః

# మహా నిర్వాణ తంత్రము

శ్లో॥ గిరీంద్ర శిఖరే రమ్యే నానారత్నోప శోభితే ।
నానావృక్షలతాకీర్ణే నానాపక్షిర వైర్యుతే ॥

కైలాస పర్వతశిఖిరము అనేక సుందరరత్నములతో, వివిధ వృక్ష లతలతో, నానా పక్షికిలకిలా రావములతో, సర్వ ఋతు కుసుమ సురభిదళముతో మనోజ్ఞమై, శీతలసుగంధ వాయువులతో, అప్సరసల బృందగానములతో, దట్టమైన నీడలతో, మత్తకోకిల కుహూరావము లతో సిద్ధ–చారణ–గంధర్వగాణాపతులతో అలరారుచున్నది. కర్పూర ధవళాకారుడైన శివుని, లోకకళ్యాణార్ధమై పార్వతి ఇలా ప్రశ్నించింది.

దేవదవ! జగన్నాథ! కరుణానిధీ! బ్రహ్మరూపులైన మీరు 4 వేదము లను, శాస్త్రపురాణములను లోకహితం కోరి జ్ఞానభిక్ష నిచ్చారు. కృతయుగమునందు మానవులు సత్య–ధర్మములను పాటించి, దేవ, పితృలోకములకు నిరాటంకముగా వెళ్ళేవారు. స్త్రీ– పురుషులందరూ నీతిగా బ్రతికేవారు. త్రేతాయుగమునందు, ద్వాపర మందు స్మృతుల ననుసరించి కొంతమేర కర్మాచరణం చేసేవారు. కాని పాపకూప సదృశమైన ఈ కలియుగమునందు సర్వధర్మములు లోపించినవి. దురాచారము ప్రబలినది. వేదములు వాటి ప్రభావమును కోల్పో యినవి. స్మృతుల స్మరణయే లేదు. అనేక పురాణములు నష్టప్రాయ మైనవి. ధర్మకర్మ విముఖులై, మదోన్మత్తులై, కాముకులై, క్రూరులై, స్వల్పాయువు గలవారై, మందమతులై, రోగశోక సమాకుల చిత్తులై, నిర్బలులై, నీచాచారము సల్పుచున్నారు. పరనింద, పరద్రోహం, పరధనాపహరణ, పరస్త్రీ సంగమం అంతటా ప్రబలి యున్నది. బ్రాహ్మణులు శూద్రాచారములు పాటిస్తూ సంధ్యా వందనము మాని, యోగ్యత లేనివారిచే యజ్ఞయాగములు చేయించుచూ “అయాజ్య యాజకులై, తపోవ్రత భ్రష్టులై, లోకమును మోసగించుటకై జపపూజా పరాయణుల వలె నటించుచూ, నాస్తికులై పండితుల వలె వేషములు ధరించి శ్రద్ధాభక్తి వివర్జితులై, శూద్రాన్నము భుజించుచూ, ధన లోభము గలవారై యున్నారు.

"బ్రాహ్మణ్య చిహ్నా మేతావత్కేవలం సూత్రధారణం" కేవలం జందెము మాత్రమే బ్రాహ్మణ చిహ్నముగా నున్నది. అన్నపాన నియమము లేదు. నీచే చెప్పబడిన తంత్రములు ఇట్టివారిని ఉద్ధరించగల సమర్థత గలవి. భోగాపవర్గమును ఇచ్చు మంత్ర-యంత్రములు న్యాసములు- ఆసనములు, పశు, వీర, దివ్యభావ దేవతా మంత్ర సిద్ధులు, శవసాధనలు, లతాసాధనలు మొదలగు అనేక తాంత్రిక విషయములు బోధించారు. అయితే పశుభావ, దివ్యభావములు ఈ కాలమందు యోగ్యములు కావని మీరే నివారించారు. దివ్యభావమునకు శుద్ధాంతఃకరణం అవసరం. కలికల్మష చిత్తులకు, నిద్రాలస్య యుక్తులకు ఇది కుదరదు. వీరసాధన మందు పంచతత్వములు చెప్పబడ్డాయి. 1. మద్యం, 2. మాంసం, 3. మత్స్యం, 4. ముద్ర, 5. మైథునం. కలియుగమందు మానవులు శిశ్నోధర పరాయణులై, లోభత్వము కలవారై ఇంద్రియ సుఖములకై వెంపర్లాడుతూ, హితాహిత జ్ఞానశూన్యులై, బుద్ధిహీనులై, గురుభక్తి లేక అకార్యములు చేస్తూంటారు. ప్రభో! యుగ ధర్మము ననుసరించి ఈ పాపాత్ములపై దయతలచి, వీరు తరించుటకు ఆయురారోగ్య వర్చస్సులు, విద్యాబుద్ధులు వృద్ధి పొందుటకు ఏదైనా చెప్పుము స్వామీ.

ఈవిధంగా లోకానుగ్రహం చేత పార్వతి అడిగిన ప్రశ్నకు శివుడు, దయాసాగరుడై, దేవీ! నీ ప్రశ్న చాలా యోగ్యమైనది,

సత్యమైనది. ఈ కలియుగమునందు వేద-శాస్త్ర-పురాణములు పనిచేయవు. కేవలం "ఆగమ" మార్గమే శరణ్యమైనది. కలియుగము నందు ఆగమపద్ధతిలో దేవతల నర్చించినచో వారు సులభ ప్రసన్నులగుదురు. తంత్రశాస్త్రమే ఆవశ్యమాచరణీయం.

**కలౌ తంత్రోదితా మంత్రాః సిద్ధాస్తూర్ణ ఫలప్రదాః ।**
**శస్తాః కర్మసుసర్వేషు జపయజ్ఞ క్రియాదిషు॥**

వైదికమంత్రములు విషములేని సర్పముల వంటివి. కలియుగ మునందు అవి మృతప్రాయములు. గోడయందు లిఖించిన బొమ్మ రమణయోగ్యము కానట్లు వేదమంత్రములు శక్తిహీనములు .ఇతర మంత్రములతో చేయుకర్మ వంధ్యా స్త్రీ సంగమము వంటిది. అచ్చట ఫలసిద్ధి కలుగదు, కేవలం శ్రమయే మిగులును. ఇతర మంత్రముల నుపాసించువాడు గంగా నదీతీరములో నీటి కొరకు బావి త్రవ్వనటు వంటివాడు. తంత్రమార్గము ఇహ-పరముల రెండిటినీ ఇచ్చును. తంత్రములు అనేకములు గలవు. అధికార భేదము ననుసరించి భైరవ, భేతాళ, బటుక, నాయిక, శాక్త, శైవ, వైష్ణవ, సౌర, గాణపత్య మంత్ర సాధనలున్నవి.

ఈమహామంత్రము సిద్ధించిన వారికి వేద-శాస్త్ర- పురాణము లతో పని లేదు. నిర్వికారుడు, నిరాధారుడు, నిర్విశేషుడు, సర్వసాక్షి,

అందరియందు ఉన్న అవాక్ మానస గోచరుడైన ఆ సర్వజ్ఞుని ఎవరూ తెలుసుకోలేరు. జగత్తంతయూ అతని అధీనములో నున్నది. అతని కారణము చేతనే మనమందరమూ ఉద్భవించితిమి. సర్వభూతము లకు ఆ పరమేశ్వరుడే కారణము. సృష్టి కారణముచే బ్రహ్మయని, పాలనపోషణచే విష్ణువని, సంహారహేతువుచే నేనునూ, ఇంద్రాది లోకపాలకులు ఆ పరమేశ్వరుని ఆజ్ఞానువర్తులే. నీవు పరాకృతివి. వీరెవరూ స్వతంత్రించి ఏమీ చేయలేరు.

"ఆ బ్రహ్మస్తంభ పర్యంతం తన్మయం సకలం జగత్" వృక్ష మూలము నందు నీరు పోసినచో కొమ్మలు, ఆకులు, ఎట్లు తృప్తి పొందునో, ఆ పరమేశ్వర ఆరాధన వలన సమస్త దేవతలు సంతో షించెదరు. అటువంటి ఉన్నత సాధనలో సప్తాక్షర మంత్రమును చెప్పుచున్నాను వినుము. దీనికి దేశ–కాల నియమములు లేవు. ఉపవాస క్లేశములు, ఆచార నియమములు లేవు. ముద్ర –పూజలు అవసరం లేదు.

**మంత్రం:- ఓం సచ్చి దేకం బ్రహ్మ ॥**

ప్రణవము లేనిచో, షడక్షరి యగును. దీనికి తిథి, వార, నక్షత్ర, కుల, వర్గ, సంస్కార నియమములు లేవు. ఇది సిద్ధమంత్రము. సద్గురువు ద్వారా ఈ మంత్రసిద్ధి పొందినవారు అభీష్టములన్నియు

పొందెదరు. మంత్రగ్రహణ మాత్రము చేతనే బ్రహ్మమయు లగుదురు. మంత్రార్థము, మంత్రచైతన్యము తెలియనిదే ఏ మంత్రమూ పని చేయదు. ఓంకారములో అకార–ఉకార–మకారములు సృష్టి–స్థితి – లయకారకులను సూచించును. సత్ శబ్దమునకు ఎల్లప్పుడూ ఉండువాడని, చిత్ శబ్దమునకు "చైతన్య"మని అర్ధము. ఏకం శబ్దము అద్వైతమును బ్రహ్మ శబ్దమునకు సర్వవ్యాపి అని అర్థము. ఈ మంత్ర ప్రతిపాద్య దేవత సనాతనుడు, సర్వవ్యాపి అయిన పరమాత్మ. ఈ మంత్రములో ఓంకారము తీసివేసి, ఐం– హ్రీం– శ్రీం బీజములు చేర్చి జపించినచో విద్యా–విజయ–సంపదలు లభించును. ఋషి సదాశివుడు– ఛందస్సు అనుష్టుప్, సర్వాంతర్యామి పరబ్రహ్మ దేవత.

## అంగన్యాస - కరన్యాసములు

**సదాశివాయ ఋషయే నమః శిరసి ॥ అనుష్టుప్ ఛందసే నమః ముఖే॥ సర్వాంతర్యామి నిర్గుణ పరబ్రహ్మణే నమః హృది ధర్మార్థ కామమోక్షా వాప్తయే వినియోగః నమః - స్వాహా - వషట్ - హుం ॥ వౌషట్ - ఫట్**

**పల్లవములతో మూలమంత్రముతో న్యాసము చేయవలెను. ప్రాణాయామము గురువు వద్ద నేర్చుకొని ఈ మంత్రజపము చేయవలెను.**

## ధ్యాన శ్లోకం

శ్లో॥ హృదయ కమలమధ్యే నిర్విశేషం నిరీహం
హరిహర విధివేద్యం యోగిభిర్ధ్యాన గమ్యం ॥
జననమరణ భీతిభ్రంశి సచ్చిత్స్వరూపం
సకల భువనబీజం బ్రహ్మ చైతన్యమీడే ॥

మూలమంత్రముతో మానసపూజ గావించి జపం చేయాలి.

## బ్రహ్మ పంచరత్న స్తోత్రం

శ్లో॥ ఓం నమస్తే సత్యే సర్వలోకాశ్రయాయ
నమస్తేచితే విశ్వరూపాత్మకాయ ॥
నమోద్వైత తత్వాయ ముక్తిప్రదాయ
నమోబ్రహ్మణే వ్యాపినే నిర్గుణాయ ॥ 1
త్వమేకం శరణ్యం త్వమేకం వరేణ్యం
త్వమేకం జగత్కారణం విశ్వరూపం ॥
త్వమేకం జగత్కర్తృ పాతృ ప్రహర్తృ
త్వమేకం పరం నిశ్చలం నిర్వికల్పం ॥ 2
భయానాం భయం భీషణం భీషణానాం
గతిఃప్రాణినాం పావనం పావనానాం ॥
మహోచ్చం ప్రదానం నియంతృత్వమేకం
పరేషాం పరం రక్షకం రక్షకం రక్షకాణాం ॥ 3

పరేశప్రభో సర్వరూప ప్రకాశన్
అనిర్దేశ్య సర్వేంద్రియాగమ్య సత్య ॥
అచింత్యాక్షర వ్యాపకావ్యక్తతత్త్వ
జగద్భాసకాధీశ పాయాదపాయాత్ ॥ 4
తదేక స్మరామస్తదేకం జపామ
స్తదేకం జగత్సాక్షిరూపం నమామః
నదేకం నిధానం నిరాలంబమీశం
భవాంభోధిపోతం శరణ్యం ప్రజామః ॥ 5
పంచరత్నమిదం స్తోత్రం బ్రహ్మణః పరమాత్మనః
యఃపఠేత్ప్ర యతో భూత్వా బ్రహ్మసాయుజ్య మవాప్నుయాత్ ॥
ప్రదోషేయః పఠేన్నిత్యం సోమవారే విశేషతః
శ్రావయేద్బోధయేత్ప్రాజ్ఞః బ్రహ్మనిష్ఠాన్ స్వబాంధవాన్ ॥

## జగన్మంగళ కవచం

**మంత్రం:–**

**కవచం శృణుం చార్వంగి జగన్మంగళ నామకం**
**పఠనాద్ధారణాద్యస్య బ్రహ్మజ్ఞో జాయతేధృవం**
**పరమాత్మా శిరఃపాతు హృదయం పరమేశ్వరః**
**కంఠంపాతు జగత్పాతా వదనం సర్వదృగ్విభుః**
**కరౌమేపాతు విశ్వాత్మా పాదౌరక్షతు చిన్మయః**

**సర్వాంగం సర్వదాపాతు పరంబ్రహ్మ సనాతనం ॥**
**శ్రీ జగన్మంగళస్యాస్య కవచస్య సదాశివః**
**ఋషిచ్ఛందోనుష్టుబితి పరబ్రహ్మ దేవతా**
**చతుర్వర్గ ఫలావాప్త్యై వినియోగః ప్రకీర్తితః**
**భూర్జేవిలిఖ్యగుటికాం స్వర్ణస్థాం ధారయేద్హృది**
**కంఠేవా దక్షిణేబాహౌ సర్వసిద్ధీశ్వరో భవేత్ ॥**

ఈ బ్రహ్మమంత్రోపాసకులు అసత్యభాషణం, పరస్త్రీ గమనం చేయరాదు. అన్ని కర్మల ప్రారంభంలోనూ "తత్సత్" అని పలుకవలెను. పాన-భోజన సమయములందు "బ్రహ్మార్పణమస్తు" అని అనవలెను.

**బ్రహ్మగాయత్రి:- ఓం పరమేశ్వరాయ విద్మహే పర తత్త్వాయ ధీమహీ ॥ తన్నో బ్రహ్మ ప్రచోదయాత్ ॥**

బ్రహ్మ ముహూర్తకాలంలో యధాశక్తి బ్రహ్మగాయత్రి మంత్రం జపించాలి. 32 వేలు జపం చేయాలి. దశాంశము హోమాదులు పురశ్చరణ చేయాలి.

దేవీ! జగద్రక్షణ కొరకు ఒకసారి ద్విభుజములతో, ఒకసారి చతుర్భుజములతో, షడ్భుజములతో, అష్ట భుజములతో రూపధారణ చేయుచున్నావు. దానిని అనుసరించే మంత్ర- యంత్రములు, సాధనలు తంత్రములలో చెప్పబడ్డాయి. బ్రహ్మజ్ఞానము పొందిన

సాధకులకు పవిత్ర-అపవిత్రభావము లేదు. సర్వభూతములను అంతర్భూతము చేయుటచే మహాకాలుడని పేరు కలిగెను. నీవు మహాకాలుని అంతము చేయుటకు శక్తి గల దానవగుటచే, ఆద్యా, కాళి, పరా అని పిలువబడుచున్నావు.

భోగమున్న చోట యోగముండదు. యోగములో భోగముండదు. కౌళ మతాచారములో భోగయోగములు రెండూ లభిస్తాయి. కౌళ ధర్మమును మించిన ధర్మము లేదు. కలి ప్రభావము అధికమై కౌళదీక్ష యందు వైదిక, పౌరాణిక దీక్షలు నిలువలేవు. కలికాలములో గంగా నది ప్రతీచోట ఛిన్నాభిన్న మగును. ఇతర దేశములోని మ్లేచ్ఛ రాజులు, ధనలోభము కలవారగుదురు. స్త్రీలు కలహప్రియులగుదురు. ధనలోభముచే తల్లి, తండ్రి, సోదరులు, బంధువులు, మిత్రులు అనే వివక్ష లేక కలహింతురు. బహిరంగ ముగా మద్యమాంసములు సేవింతురు.

పూర్వయుగములలో సురాపానమునకు నియమము లున్నవి. సత్యాచారములు పాటించుకౌళాచారము గలవారిని కలి బాధించదు. సత్యరహితమైన పూజ, జపము, తపము, వ్యర్థము. ఎడారిలో విత్తనం పాతడం వంటిది. కృతయుగములో ధర్మము నాలుగు పాదముల తోనూ, త్రేతాయుగములో మూడు పాదములతోనూ, ద్వాపర యుగములో రెండు పాదములతోనూ, కలియుగములో పాద

మాత్రము చేతనూ చరించును. జననాది సర్వ సంస్కారములు ఆగమ మార్గంలోనే చేయవలెను.

**హ్రీం శ్రీం క్రీం పరమేశ్వరీ స్వాహా ॥**

ఈ దశాక్షర మంత్రమును సర్వవిద్యా మంత్రము. దీనికి కాళికే హ్రీం శ్రీం క్లీం చేర్చినచో షోడశీ మంత్రమగును. ఇది చాలా ప్రభావము కలది. శక్తిమంత్రములు కౌళాచారములోనే బాగుగా సిద్ధించును.

ఆత్మతత్వాయ స్వాహా, విద్యాతత్వాయ స్వాహా, శివతత్వాయ స్వాహా అని ఆచమనము చేసి నీటియందు కులయంత్రము లిఖించి మూలమంత్రము 12 సార్లు జపించవలెను. ఆ జలము తేజో రూపముగా భావించి సూర్యనమస్కారము చేసి తన శిరస్సుపై చల్లుకుని ముఖం, కళ్ళు, ముక్కు, చెవులు తాకాలి. మహాపాపములను నాశనము చేయు **ఆద్యాయై విద్మహే పరమేశ్వర్యై ధీమహీ తన్నో కాళీ ప్రచోదయాత్** – అనే గాయత్రీ మంత్రం జపించాలి.

## అద్యకాళీ శతనామ స్తోత్రం

**శృణుదేవీ జగద్వంద్యే స్తోత్రమే తదనుత్తమం**
**పఠనాచ్ఛ్రవణాద్యస్య సర్వసిద్ధీశ్వరో భవేత్ ॥**
**అసౌభాగ్య ప్రశమనం సుఖసంపద్వి వర్ధనం ॥**

అకాల మృత్యుహరణం సర్వాపద్వి నివారణం
శ్రీమదాద్యా కాలికాయాః సుఖసాన్నిధ్య కారణం
స్తవస్యాస్య ప్రసాదేన త్రిపురారి రహంశివే ॥
స్తోత్రస్యాస్య ఋషిర్దేవి సదాశివ ఉదాహృతః
ఛందోనుష్టు బ్దేవతాద్యా కాళికా పరికీర్తితా ॥
హ్రీంకాళి శ్రీంకరాళి చక్రీ కళ్యాణి కళావతీ
కమలా కలిదర్పఘ్నీ కపర్దీ శ కృపాన్వితా
కాళికా కాలమాతాచ కాలానల సమద్యుతిః
కపర్దినీ కరాళాస్య కరుణామృత సాగరా ॥
కృపామయీ కృపాధారా కృపాపారా కృపాగమా
కృశానుః కపిలాకృష్ణాః కృష్ణానంద వివర్ధినీ
కాళరాత్రిః కామరూపా కామపాశ విమోచనీ
కాదంబినీ కలాధారా కలికల్మష నాశినీ
కుమారీ పూజనప్రీతా కుమారీ పూజకాలయా
కుమారీ భోజనానంద కుమారీ రూపధారిణీ
శ్లో॥ కదంబవన సంచారా కదంబ వనవాసినీ
కదంబపుష్ప సంతోషా కదంబ పుష్పమాలినీ
కిశోర కాలకంఠాచ కలనాద నినాదినీ
కాదంబరీ పానరతాతథా కాదంబరీ ప్రియా
కపాలపాత్ర నిరతా కింకాళ మాల్యధారిణి

కమలాసన సంతుష్టా కమలాసన వాసినీ
కమలాలయ మధ్యస్థా కమలామోద మోదినీ
కలహంసగతిః క్లైబ్య నాశినీ కామరూపిణీ
కామరూప కృతావాసా కామపీఠ విలాసినీ
కమనీయా కల్పలతా కమనీయ విభూషణా
కమనీయ గణారాధ్యా కోమలాంగీ కృశోదరీ
కారణామృత సంతోషా కారణానంద సిద్ధిదా
కారణానంద జాపేష్టా కారణార్చన హర్షితా
కారణార్ణవ సమ్మగ్నా కారణావ్రత పాలినీ
కస్తూరీ సౌరభామోదా కస్తూరీ తిలకోజ్వలా
కస్తూరీ పూజనరతా కస్తూరీ పూజకప్రియా
కస్తూరీ దాహజననీ కస్తూరీ మృగతోషిణీ
కస్తూరీ భోజనప్రీతా కర్పూర చందనోక్షితా
కర్పూర కారణాహ్లాదా కర్పూరామృత పాయినీ
కర్పూరసాగర స్నాతా కర్పూర సాగరాలయా
శ్లో॥ కూర్చబీజ జపప్రీతా కూర్చజాప పరాయణా
కులీనా కౌళికారాధ్యా కౌళీక ప్రియకారిణీ
కులాచార కౌతుకినీ కులమార్గ ప్రదర్శినీ
కాశీశ్వరీ కష్టహర్త్రీ కాశీశ్వర వరదాయినీ
కాశీశ్వర కృతామోదా కాశీశ్వరమనోరమా

కలమంజీర చరణాక్వణత్కాంచీ విభూషణా
కాంచనాద్రి కృతాగారా కాంచనాచల కౌముదీ
కామబీజ జపానందా కామబీజ స్వరూపిణీ
కుత్సితఘ్నీ కులీనార్తి నాశినీ కులకామినీ
క్రీం హ్రీం శ్రీం మంత్రవర్ణేన కాలకంటకఘాతిని
ఇత్యాద్యా కాళికాదేవ్యాః శతనామ ప్రకీర్తితం
కకారకూట ఘటితం కాళీరూప స్వరూపకం
పూజాకాలే పఠేద్యస్తు కాళికా కృతమానసః
మంత్రసిద్ధర్భ వేదాశుతస్య కాళీప్రసీదతి ॥

అమావాస్య మంగళవారం అర్ధరాత్రి సమయమందు పంచమకారములతో ఆదికాళికను అర్చించి, ఈ శతనామస్తోత్రం పఠించిన అసాధ్యమన్నది ఉండదు. ఈ స్తోత్రం108 సార్లు పారాయణ చేసిన పురశ్చరణ అగును. దేవీ! ఇక నీకు కాళిక యొక్క త్రైలోక్య విజయమనే కవచం చెబుతాను విను.

## త్రైలోక్య విజయ కవచం

అస్యశ్రీ త్రైలోక్య విజయస్య కవచస్య సదాశివ ఋషిః అనుష్టుప్ ఛందః ఆద్యా కాళీదేవతా - హ్రీం బీజం శ్రీంశక్తిః క్రీం కీలకం - కామ్య సిద్ధ్యర్థే కవచపాఠే వినియోగః ॥ ఓం సదాశివ ఋషయే నమః శిరసి॥ ఓం అనుష్టుప్ ఛందసే నమః

ముఖే ॥ ఓం ఆద్యా కాళికా దేవతాయై నమః హృది ॥ ఓం హ్రీం బీజాయ నమః గుహ్యే ॥ ఓం శ్రీం శక్తయే నమః పాదయోః ॥ ఓం క్రీం కాళికాయై నమః స ర్వాంగే అని అంగన్యాసం.

శ్లో॥ హ్రీమాద్యామే శిరఃపాతు శ్రీం కాళీవదనం మమ
హృదయం క్రీం పరాశక్తిః పాయాత్కంఠం పరాత్పరా ॥
నేత్రేపాతు జగద్ధాత్రీ కర్ణౌరక్షతు శంకరీ
ఘ్రాణంపాతు మహామాయారసనాం సర్వమంగళా
దంతాన్రక్షతు కౌమారీ కపోలే కమలాలయా
ఓష్ఠాధరౌక్షమా రక్షే చ్చిబుకం చారుహాసినీ ॥
గ్రీవాంపాయా త్కులేశాని కకుత్పాతు కృపామయీ
ద్వౌబాహు బాహుదారక్షేత్కరౌ కైవల్యదాయినీ
స్కంధౌ కపర్దినీ సాతు పృష్టం త్రైలోక్య తారిణీ
పార్శ్వే పాయాదపర్ణామే కటింమే కమఠాసనాః
నాభౌపాతు విశాలాక్షి ప్రజాస్థానం ప్రభావతీ

శ్లో॥ ఊరూ రక్షతు కళ్యాణి పాదౌ మేపాతు పార్వతీ
జయదుర్గావతు ప్రాణాన్సర్వాంగం సర్వసిద్ధిదా
రక్షాహీనంతు యత్ స్థానం వర్జితం కవచేన చ
తత్సర్వం మేసదారక్షే దాద్యాకాళీ సనాతనీ
ఇతితే కథితం దివ్యం త్రైలోక్య విజయాభీదం ॥

**సర్వాన్ కామా నవాప్నోతి తస్మాదాసు ప్రసీదతి**
**మంత్రసిద్ధి ర్భవేదాశు కింకరాః క్షుద్రసిద్ధయః ॥**
**అపుత్రో లభతే పుత్రం ధనార్థీ ప్రాప్నుయాద్ధనం**
**విద్యార్థీ లభతే విద్యాంకామీ కామాన వాప్నుయాత్॥**

ఈ కవచం 1000 సార్లు జపిస్తే పురశ్చరణ యోగ్యమగును. చందనాగరు కస్తూరీ కుంకుమ రక్తచందనముల మిశ్రమంతో భూర్జ పత్రంపై లిఖించి, కంఠమందు గానీ, కుడిచేతి భుజమునకు గానీ ధరించిన కాళికానుగ్రహం కలుగును.

కాళికా మంత్రజపము మాసశివరాత్రి మంగళవారం గాని, మాసశివరాత్రి శనివారం గానీ అర్ధరాత్రి యందు 10వేలు జపము చేసి పురశ్చరణ చేయవలెను. మంగళవారము నుండి మంగళవారము వరకు ప్రతిరోజూ వెయ్యి జపం చేసి, మొత్తం 8వేలు జపం చేసి పురశ్చరణ చేయవచ్చు. ఈ కాళీ మంత్రమునకు సిద్ధారి శోధన లేదు. నియమములు లేవు. చిత్తశుద్ధి మాత్రము ఉండవలెను. బ్రహ్మ మంత్రము వలెనే యోగ్యుడైన గురువు నుండి మంత్రోపదేశము పొందవలెను.

**చిత్తశుద్ధౌ మహేశాని బ్రహ్మజ్ఞానం ప్రజాయతే**
**బ్రహ్మజ్ఞానే సముత్పన్నే కృత్యాకృత్యం న విద్యతే ॥**

**తాత్పర్యము:-** చిత్తశుద్ధి వలన బ్రహ్మజ్ఞానము కలిగినపుడు కృత్యము – అకృత్యములేదు.

**జీవః ప్రకృతి తత్త్వంచ దిక్కాలాకాశమేవ చ ।**
**క్షిత్య ప్తేజో వాయవశ్చ కులమిత్యభీధీయతే ॥**

జీవుడు – ప్రకృతితత్వం – దిక్ – కాలము – పృధివి – బలం – తేజము – వాయువు – ఆకాశము ఈ తొమ్మిదీ కులమందురు. బ్రహ్మ విషయకమైన బుద్ధితో నిర్వికల్పముగా చేయునదే "కులాచార" మందురు. దీనివలన ధర్మార్థ కామమోక్షములు నాలుగూ సిద్ధించును. బహుజన్మార్జిత తపము – దానము ఇత్యాది పుణ్యసంచయము వలననే కులాచారము సక్రమముగా ఆచరించగలుగును.

**సద్గురుసేవ:-** అనుగ్రహము వలన పంచమకారములతో కులేశ్వరిని అర్చించగలుగును. కౌళమార్గమందు ఆద్యా కాళీని ఆరాధించి సాధకుడు ఇహలోకములో భోగములను – పరలోకములో మోక్షమును పొందగలుగును. కౌళసంస్కారము జరగనిదే, ఇంద్రియ లోలత్వముచే మద్యపానము మొదలైన పంచమకారములు స్వీకరించరాదు.

**ఆద్యతత్వం విద్ధి తేజో ద్వితీయం పవనంప్రియే ॥**
**అపస్తృతీయం జానీహి చతుర్థం పృధివీం శివే**
**పంచమం జగదాధారం వియద్విద్ధి వరాననే ॥**

పంచమకారములలో మద్యము – తేజఃతత్వము, మాంసము – వాయుతత్వం, జలతత్వం – ముద్ర, పృధివీతత్వం – మైధునం జగదాధారమైన ఆకాశతత్వం. కృత, త్రేతా, ద్వాపర యుగములందు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనే నాలుగు వర్ణములుండును. కలియుగమునందు 5వ వర్ణము “సామాన్యం” గా ఉండును. కలి యుగములో తపము, వేదాధ్యయనము లేక అల్పకాల జీవులై యుందురు. బ్రహ్మచర్యాశ్రమము, వానప్రస్థాశ్రమము రెండూ కలవు. కేవలం గృహస్థాశ్రమం లేదా భిక్షుకాశ్రమం రెండే ఉండును. గృహస్తునకు అగమమార్గములోనే క్రియాసిద్ధి కలుగును. భిక్షుకునకు వేదోక్త దండధారణ, సంస్కారములు ఉండవు. ఈ రెండు ఆశ్రమము లకు అన్ని వర్ణముల వారూ అధికారులే. గృహస్థాశ్రమ జీవితం గడిపిన తరువాత తత్వజ్ఞానము కలిగి వైరాగ్యము కలిగినపుడు సన్యాస జీవితం గడపాలి. వృద్ధులైన తల్లితండ్రులను, యౌవనవతి, పతివ్రత అయిన భార్యను, సంతానమును వదిలి సన్యాసము గ్రహించరాదు. తల్లితండ్రులను పార్వతీపరమేశ్వరులుగా భావించి సేవించాలి. ఇదే గృహస్తులకు తపము వంటిది. తల్లితండ్రులను అవమానించరాదు. వారిఆజ్ఞ మీరరాదు. వారిని ఎల్లప్పుడూ సంతోషపరచవలెను. భార్యను హింసించరాదు. పరస్త్రీలను తాకరాదు. పరస్త్రీలతో అయుక్త భాషణం చేయరాదు.

4సం॥ల వరకూ కుమారులను గారాబము చేయవలెను. 16 సం॥ల వరకూ విద్యాబుద్ధులు చెప్పవలెను. 20 సం॥ల వయస్సులో గృహకర్మలయందు వారిని నియోగించవలెను. కుమార్తెలను కూడా ఇట్లే పోషించి, యోగ్యుడైన వరునకు ఇవ్వవలెను. ఇట్లు చేయనివారు పశువులు, పాపాత్ములు అగుదురు. నిద్ర, అలస్యము, జుట్టు పెంచు కొనుట తిండి, బట్టలయందు అత్యంత ఆశక్తి కలిగియుండరాదు. యుక్తాహారము, యుక్తనిద్ర, మితభాషిత్వములను పాటించవలెను.

**సౌహార్థం వ్యవహారాంశ్చ ప్రవృత్తి ప్రకృతి నృణాం**
**సహవాసేన తర్కైశ్చ విదిత్వా విశ్వసేత్తతః ॥**

స్నేహము, ఆచరణ, స్వభావము, ప్రవృత్తి వీటిని సహవాసముచే, తర్కముచే గ్రహించి తెలుసుకొని అపుడు విశ్వసించవలెను. అందరినీ నమ్మరాదు. సమయానుసారముగా కర్మానుష్ఠానము యుండవలెను. పరస్త్రీలయందు వైరాగ్యము, పరధనమందు నిస్పృహ, దంభమాత్స ర్యము లేనివారు లోకత్రయ విజేతలు. శుచి రెండు విధములు. బాహ్యము,అభ్యంతరము. వీటిచేత భస్మంచేత బహిఃశౌచము అగును. బ్రహ్మార్పణ బుద్ధిచే అంతః శౌచమేర్పడును. నిద్రనుండి లేచినపుడు, మైధునానంతరము, మలమూత్ర విసర్జనానంతరము, మైలస్పర్శ అయినపుడు బహిఃశౌచమును ఆచరించవలెను. నిత్యజపము మాన రాదు. కలియుగమందు బ్రాహ్మణులు గాయత్రీ మంత్రమును “ఓం”

కారముతోనూ, క్షత్రియులు “శ్రీ” కారముతోనూ, వైశ్యులు “ఐం” కారముతోనూ జపించవలెను.

**కలావన్న గతప్రాణా నోపవాసః ప్రశస్యతే**
**ఉపవాస ప్రతినిధావేకం దానం విధీయతే**
**కలౌదానం మహేశాని సర్వసిద్ధికరం భవేత్**
**తత్పాత్రం కేవలంజ్ఞేయః దరిద్రః స్యాత్క్రియాన్వితః ॥**

కలియుగమందు మానవులు అన్నగత ప్రాణులగుట చేత ఉప వాసము ప్రశస్తము గాదు. దానికి బదులుగా ఒక దానము చేయ వలెను. కలియుగములో దానమే సర్వ సిద్ధికరము. యోగ్యుడై, దీనుడై, దరిద్రుడైనవాడే దానమునకు అర్హుడగును. పాడ్యమి, అష్టమి, చతుర్దశీ, ఏకాదశీ, జన్మదినము, తల్లితండ్రుల మరణదినము, వేధ దినము పుణ్యకాలమనబడును. గంగానది, మహానది, గురుగృహము, సిద్ధక్షేత్రములు పుణ్యతీర్ధము లనబడును. కులపూజా విధానములో చక్రానుష్టానము చేయవలెను. భైరవీచక్ర విషయములో ఇట్టి నియమము లేదు.

## భైరవీ చక్రపూజ

కులాచార్యుడు అందమైన స్థానమునందు కూర్చొని “క్లీంఫట్” అను మంత్రముచే ముందుగా ఆసనశుద్ధి చేసుకొనవలెను. సాధకుడు ముందుగా సింధూరముచే గానీ, ఎర్రచందనముచే గానీ లేదా నీటిచే

త్రికోణ మండలం లేదా చతురస్రమండలం లిఖించవలెను. దానిపై ఒక చిత్రితఘటము నుంచి అందు పెరుగు, అక్షతలు వేయవలెను. దానికి సింధూర తిలకం దిద్ది ఫలము, మామిడి చిగుళ్ళు ఉంచవలెను. అనంతరం పన్నీరుతో ఘటము నింపి, ఓంకారముతో ధూప దీపములు కల్పించవలెను. గంధపుష్పములచే పూజించి ఇష్టదేవతా రాధన చేయవలెను. గురుదేవత మొదలగు 9 పాత్రలను స్థాపించ వలెను. మద్యపాత్రను "ఫట్" మంత్రముతో ప్రోక్షించి దివ్యదృష్టితో చూడవలెను. ఆ పాత్రయందు గంధపుష్పముల నుంచి ఆనందభైరవీ భైరవులను ధ్యానించవలెను. నవయౌవనవతి, విద్యావతి, నానా లంకారయుక్త, వరదాభయ ముద్రలు ధరించినది హాసవదన, నృత్యగీతానందిని అయిన ఆనందభైరవిని ధ్యానించవలెను.

## ఆనందభైరవ ధ్యానం

శ్లో॥ నవయౌవన సంపన్నాం తరుణారుణ విగ్రహాం
చారుహాసామృతాం భాసోల్ల సద్వదన పంకజాం
నృత్యగీత కృతామోదాం నానాభరణ భూషితాం
విచిత్ర వసనాంధ్యాయే ద్వరాభయ కరాంబుజామ్ ॥

శ్లో॥ కర్పూరపూర ధవళం కమలాయతాక్షం
దివ్యాంబరాభరణ భూషితదేహ కాంతిం
వామేన పాణికమలేన క్షుధాక్షపాత్రం
దక్షేణ శుద్ధగుటికాన్ దధతం స్మరామి ॥

**అనంతరం "ఆం హ్రీం క్రీం స్వాహా"**

అను మంత్రమును 108 సార్లు జపించి మద్యశోధన చేయవలెను.

గృహస్థులు మద్యపాత్రకు ప్రత్యామ్నాయంగా పాలు, తేనె, పానకములను ఉపయోగించవచ్చు. మాంసాదికము కూడా "ఆం హ్రీం క్రీం స్వాహా" అను మంత్రమును జపించి, కాళికను ధ్యానించి బ్రహ్మమయభావనతో నేత్రములు మూసుకొని పాన-భోజనములను ఆచరించవలెను. ఇదే తంత్రములో చెప్పిన భైరవీ చక్రపూజ . దీనిని ఆచరించుటకు దేశకాల నియమము లేదు. భైరవీచక్రార్చకుని చూచినంతనే పిశాచ, గుహ్యక, యక్ష, భేతాళాది క్రూరగణములు దూరముగా పోవును. చక్రపూజా మధ్యమందు వృధా సంభాషణ, ఉమ్మట వంటి పనులను చేయరాదు. వర్ణభేదము పాటించరాదు.

ద్విజాతులకు పది సంస్కారము లుండును. 1. గర్భాధాన 2. పుంసవన, 3. సీమంతోన్నయన, 4. జాతకర్మ, 5. నామకరణ, 6. నిష్క్రమణ, 7. అన్నప్రాశన, 8. చూడాకరణ, 9. ఉపనయన, 10. వివాహ సంస్కారములు. శూద్రులకు ఉపనయన సంస్కారము లేదు. వారికి తొమ్మిది సంస్కారములే ఉండును. నిత్యనైమిత్తికాది సర్వకర్మలూ "హ్రీం" కారము జోడించి చేయవలెను. యుగభేదము ననుసరించి నాచే నిగమాగమ తంత్రములు చెప్పబడినవి.

# కుశండికా (హోమం)

రమ్యమైన ప్రదేశమునందు హస్త ప్రమాణములో "స్థండిలం" కల్పించవలెను. (మట్టివేసి దానిపై వరిపిండి వేయవలెను) తూర్పు అగ్రముగా మూడు రేఖలు గీసి "హూం" అనే మంత్రముతో అభ్యక్షించి, "రం" బీజముతో అగ్నిని తీసుకువచ్చి "ఐం" బీజముతో దానిని మండలమునకు పార్శ్వభాగమున ఉంచవలెను. కుడిచేత్తో "హ్రీం క్రవ్యాదేభ్యో నమః స్వాహా" అను మంత్రమును పఠించి అందు నుండి మండుతున్న ఒక సమిధను దక్షిణదిశగా రాక్షసశాంతికై పడ వేయవలెను. ఈ ప్రకారముగా అగ్నిని రెండుచేతులతో ఎత్తి హ్రీం భూర్భువస్సువః అనుచూ స్థండిలము పైనున్న మూడురేఖలపై ఉంచవలెను. సమిధలతో జ్వలింపచేయవలెను. నేతితో కూడిన సమిధలు అగ్నిలో వేయుచూ ధనంజయాగ్నిని ఇట్లు ధ్యానించవలెను.

**బాలార్కారుణ సంకాశం సప్తజిహ్వాం ద్విమస్తకం**
**అజారూఢం శక్తిధరం జటామకుట మండితం ॥**

అని ధ్యానించి **"హ్రీం ఏహ్యేహి సర్వామరప్రియే హవ్యావాహ మునిభిః సగణైస్సహ అధ్వరం రక్షరక్ష నమః స్వాహా ॥** అను మంత్రముతో అగ్నిని ఆవాహన చేయవలెను. "వహ్నా అయంతే యోనిః" అని ఉచ్ఛరించి పాద్యాది ఉపచారములు చేసి, అగ్నియొక్క సప్త జిహ్వాలకు అర్చన చేయవలయును.

కాళి, కరాళీ, మనోజవా, సులోహితా, సుధూమ్రా స్ఫులింగినీ, విశ్వరూపిణీ అని తూర్పు నుండి ఉత్తరదిశ వరకు 3సార్లు ప్రోక్షణ చేయవలెను. తరువాత దక్షిణదిశ నుండి ఉత్తరదిశ వరకు 3 సార్లు ప్రోక్షించి హోమ వస్తువులను 3సార్లు ప్రోక్షించవలెను. స్థండిలమునకు తూర్పుదిశ నుండి ఉత్తరదిశ వరకు దర్భలు పరిస్తరణ చేయవలెను. ఇవి ప్రాగగ్రముగా, ఉదగగ్రమముగా నుండవలెను. అగ్నిని దక్షిణదిశ నుంచి బ్రహ్మాసనము వద్ద ఎడమచేయి అంగుష్ఠ, కనిష్ఠికలతో బ్రహ్మా సనము నుండి ఒక దర్భను గ్రహించి, హ్రీం నిరస్తః పరావసుః ॥ అను మంత్రమును పఠించి అగ్నికి దక్షిణమున వేయవలెను. "హే బ్రహ్మన్ ఇదంతే కల్పితాసనం" అని బ్రహ్మను ఆసనముపై ఆహ్వానించ వలెను. "సీదామి" అనుచు బ్రహ్మ కూర్చోవలెను. బ్రహ్మను గంధ పుష్పాక్షతలతో అర్చించి, ఇట్లు ధ్యానించవలెను.

**గోపాయ యజ్ఞం యజ్ఞేశ యజ్ఞం పాహి బృహస్పతే**
**మాంచయజ్ఞ పతింపాహి కర్మసాక్షి నమోస్తుతే ॥**

బ్రహ్మ "గోపాయామి" బ్రహ్మ లేనపుడు దర్భను బ్రహ్మను ఇహా గచ్ఛ ఆగచ్ఛ యావద్యజ్ఞ సమాపనం తావద్భవద్భిః స్థాతవ్యం" అని ప్రార్థించి నమస్కరించవలెను. చేతితో నీరు గ్రహించి, అగ్నియొక్క ఈశాన్య కోణం నుండి బ్రహ్మాస్థానము వరకు 3 సార్లు ప్రోక్షించి పర్యుక్షించి అగ్నిని కూడా 3 సార్లు ప్రోక్షించి తిరిగి వెళ్ళిన అదే

మార్గము నుండి నడిచివచ్చి తనస్థానములో కూర్చొని స్థండిలము నకు ఉత్తరమున దర్భలను ఉదగ్రముగా పరిస్తరించవలెను. జలసహిత ప్రోక్షిణీ పాత్ర– ఆజ్యస్థాలి– సమిధలు – కుశలు వాటిపై ఉంచవలెను. స్రుక్– స్రువములు గ్రహించి వాటిపై ఉంచి, "హ్రాం–హ్రీం–హ్రూం" అను మంత్రమును పఠించి రెప్పవాల్చకుండా (దివ్యదృష్టి) వాటన్నిటినీ శుద్ధి చేయవలెను.

భూమిపై కుడిమోకాలు ఆనించి స్రుక్‌తో స్రువము నుండి నెయ్యిని గ్రహించి, "శుభేచ్ఛతో హ్రీం విష్ణవే స్వాహా" అనే మంత్ర ముతో 3సార్లు ఆహుతి చేయవలెను. వాయవ్యం నుండి ఆగ్నేయం వరకు ప్రజాపతిని మనసా ధ్యానించి "హ్రీం ప్రజాపతయే స్వాహా" అనే మంత్రముతో నేతితో హోమం చేయవలెను. నైఋతి నుండి ఈశాన్యం వరకు పురందరుని మనసా ధ్యానించి "హ్రీం పురందరాయ స్వాహా" అనే మంత్రముతో నేతితో హోమం చేయవలెను. మరల నేతిని గ్రహించి అగ్నిలో ఉత్తర–దక్షిణ మధ్యలో "హ్రీం అగ్నీ షోమాభ్యాం నమః" అని పఠించి 3 సార్లు ఆహుతి ఇవ్వవలెను. ఈప్రకారం ధారాహోమం చేసి యదార్థదేవతకు హోమం చేయ వలెను. అనగా హోమం శివునకు చేయుచున్నచో మూల మంత్ర మైన పంచాక్షరీతో "ఓం నమఃశివాయ స్వాహా శివాయేదం నమః" అని యథాసంఖ్య హోమం చేయవలెను. మూల మంత్రము చివర

"స్వాహా" ఉన్నచో రెండవసారి స్వాహా చేర్చనవసరం లేదు. కలియుగ మందు ప్రాయశ్చిత్త హోమం చేయించనవసరం లేదు. స్రువముతో ఆజ్యము గ్రహించి "అస్మిన్ కర్మణి దేవేశ ప్రమాదాద్భ్రమతోపి వా ॥ న్యూనాధికం కృతం యచ్ఛ సర్వం స్విష్టకృతం కురు" ॥

అని బ్రహ్మను ధ్యానించి హ్రీం దేవి స్వాహా అనుచూ హోమం చేయవలెను. మరల ఆజ్యము గ్రహించి హ్రీం త్వమగ్నే సర్వలోకానాం పావనం స్విష్టికృత్ ప్రభుః ॥ యజ్ఞసాక్షీ క్షేమకర్తా సర్వాన్ కామాన్ ప్రపూరాయ స్వాహా ॥ అని స్విష్టకృత్ హోమం చేయవలెను. అయుక్త కర్మ పరిహారార్ధం హ్రీం భూఃస్వాహా హ్రీం భువః స్వాహాః హ్రీం స్వః స్వాహా అను మంత్రముచే వ్యాహృతి హోమం చేయవలెను.

హ్రీం భూర్భువః సువః స్వాహా అని ఒకసారి ఆహుతి ఇచ్చి యజ్ఞకర్త – యజమాని ఇద్దరూ ఆహుతి ఇవ్వవలెను. అనంతరం "హ్రీం" యజ్ఞపతే పూర్ణోభవతు యజ్ఞోమే హృష్యంతుయజ్ఞ దేవతాః – ఫలాని సమ్యక్ యచ్ఛంతు స్వాహా" అని పూర్ణాహుతి ఇవ్వవలెను. అనంతరం ప్రోక్షిణీపాత్ర జలమును కుశలతో గ్రహించి శిరస్సుపై సంమార్జన చేయాలి. ఆపోహిష్టామ అనే మంత్రమును చదువవలెను.

"యే ద్విషంతి చ మాంనిత్యం యాంశ్చద్విష్మో నరాన్వయం ॥ ఆపో దుర్మిత్రి యాస్తేషాం సంతుభక్షంతు తానిపి" అని నీరును

ఈశాన్యమందు భూమిపై చల్లవలెను. ఆ దర్భలను ఆచటనే వదిలి "బుద్ధిం విద్యాబలం మేధాం ప్రజ్ఞాం శ్రద్ధాంయశః శ్రియం ఆరోగ్యం తేజ ఆయుష్యం దేహి మేవాహ్యావాహన" ॥ అని పఠించి "యజ్ఞ యజ్ఞ పతిం గచ్ఛ యజ్ఞం గచ్ఛ హుతాశనః ॥ స్వాం యేనిం గచ్ఛ యజ్ఞేశ పూరయాస్మాన్మనోరధమ్॥ అగ్నే క్షమస్వ స్వాహా ॥

అని పఠించి అగ్నికి ఉత్తరభాగములో పెరుగుతో ఆహుతి ఇచ్చి దక్షిణ భాగమునందు బ్రహ్మకు దక్షిణ ఇచ్చి విసర్జించవలెను. స్రువపాత్రకు అంటిన భస్మాన్ని తిలకముగా గ్రహించి ధరించవలెను. "హ్రీం క్రీం సర్వశాంతి కరోభవ" అనే మంత్రముతో యజ్ఞకర్త లలాటమందు తిలకధారణ చేయవలెను.

మట్టిపాత్ర లేదా రాగిపాత్రను చరుపాత్రగా గ్రహించి అందు కొద్దిగా బియ్యము వేసి పాలతో వండి స్రువముతో ఆజ్యము వేసి, అగ్నికి ఉత్తరభాగంలో కుశలపై ఉంచి మూడుసార్లు కుశలతో ఆజ్య ప్రోక్షణ చేసి, ఆచ్ఛాదించి స్రువముతో చరుపాత్ర నుండి ద్రవ్యమును గ్రహించి దానిపై కొద్దిగా ఆజ్యం వేసి "జానుహోమం" చేయాలి. అనంతరం ధారాహోమం, ప్రధాన దేవతాహోమం చేయాలి.

**శర్కరా మధు దుగ్ధంచ ఘృతందధి సమాంశకం**
**పంచామృత మిదంప్రోక్తం దేహశుద్ధౌ విధీయతే ॥**

పంచదార, తేనె, పాలు, పెరుగు, నేయి వీటిని పంచామృత ములు అంటారు. ఇవి శరీరశుద్ధి చేయును. వాపీకూప తటాక దేవతా ప్రతిష్ఠ, గృహ, వ్రతములందు అన్నివేళలా పంచదేవతలను పూజించి వసుధార, వృద్ధి, శ్రాద్ధం, కుశకండికలను ఆచరించాలి.

## పూర్ణాభిషేకం

కౌలాచారములో గురువు ద్వారా శిష్యుడు పూర్ణాభిషిక్తుడు కానిదే మద్యనివేదన చేయరాదు. ముందుగా గురువు గణపతి పూజ చేసి కులసాధకులకు భోజనం పెట్టాలి. మరుసటిరోజు స్నానం చేసి నిత్య కర్మను చేసుకొని ఆజన్మకృత పాపపరిహారార్థం తిల, కాంచన దానం చేసి బ్రాహ్మణ భోజనం పెట్టాలి. త్రిమూర్తులను అర్చించి మాతృ గణార్చన, వృద్ధిశ్రాద్ధం చేసి గురువును దీక్ష ఇమ్మని ప్రార్థించాలి. గురువు కల్పోక్త ప్రకారం అర్చన చేసి నవపాత్రలను స్థాపిస్తారు. గురుపాత్ర బంగారముతోను, శక్తిపాత్ర వెండితోను, శ్రీపాత్ర మహా శంఖములోను, మిగిలిన 6 రాగిపాత్రలుండాలి. వాటియందు తల్పములుంచి మహాదేవార్చన చేసి, ఆనందభైరవికి తర్పణ చేసి, అమృతకలశ పూజ చేసి, ధూపదీపములు, సర్వభూతబలి అర్పించాలి. అనంతరం సర్వదేవతాగణ నామములు ఉచ్చరించి మంత్రజలముతో గురువు శిష్యునికి అభిషేకం చేస్తారు. పూర్ణాభిషేకము వలన బ్రహ్మ

జ్ఞానము, శివతత్వమూ కలుగుతాయి. ఈ పూర్ణాభిషేకము 9-7-5-3-1 రోజులలో చేయవచ్చు.

(ఇచ్చట బ్రాహ్మణాది జాతులకు సామాజిక న్యాయములు, వారి కులధర్మములు, కృత్యాకృత్యములు చెప్పబడినవి. కౌళార్చనలో తప్ప మిగిలిన సమయములో మద్యపానము మహాపాపముగా చెప్ప బడినది. కామదృష్టితో పరస్త్రీలను చూడరాదని, పరధనమును ఆశించ రాదని మొదలైన నీతిబోధలు చేయబడినవి. దొంగతనమునకు కర్ణ చ్ఛేదము దండనగా చెప్పబడినది. దొంగసాక్ష్యము చెప్పువారికి తీవ్ర దండన విధించబడినది. లిఖితరూపముగా నున్నదానికి ప్రాధాన్యత ఇవ్వబడినది. కొన్ని పాపములకు ఉపవాసాది, సచేల స్నానము మొదలైన ప్రాయశ్చిత్తములు చెప్పబడినవి. ఆస్తిహక్కులు, వారసత్వాది న్యాయశాస్త్ర విషయములు వివరించబడినది. తల్లితండ్రులను, గురువును, మొదలైన పెద్దలను చేతితో కొట్టిన వారికి ఆస్తిలో హక్కు పోవునని చెప్పబడింది).

గృహప్రవేశ సమయములో వాస్తుపూజ తప్పనిసరిగా చేయ వలెను. లేనిచో అనేక విఘ్నములు కలుగును. దేవాలయమునకు ధ్వజస్థంభమును 82 హస్తముల ప్రమాణము కలది దానము చేసినచో ఆయుర్దాయము పెరుగును. ఆయుష్కాములు నవగ్రహహోమము

లను ఆచరించవలెను. నమోంత మంత్రములకు చివర మరొక నమః చేర్చనవసరం లేదు. అదేవిధముగా హోమము చేయునపుడు మూల మంత్రమునకు చివర స్వాహా పదమున్నచో, మరొక స్వాహా చేర్చ నవసరము లేదు.

**"స్వాహాంతేపి తధామంత్రే నదద్యా ద్వహ్ని వల్లభామ్ " ॥**

గ్రహములకు వాటి వర్ణానుసారముగా పుష్పాక్షతలను సమ ర్పించవలెను. గృహముపైన త్రిశూలమును గానీ, చక్రమును గానీ ఉంచవలెను. ఈశాన్యకోణమందు ధ్వజపతాకమును ఉంచవలెను. షోడశోపచారములు తెలుపబడినవి.

# శివలింగ ప్రతిష్ఠ

**స్వర్ణపూర్ణ పూర్ణ మహీదానా ద్విజమేధా యుతార్చనాత్**
**నిస్తోయే తోయకరణాద్దీనార్త పరితోషణాత్ ॥**
**యత్ఫలం లభే మర్త్యఃతస్మాత్ కోటిగుణఫలం**
**శివలింగ ప్రతిష్ఠాయాం లభతేనాత్ర సంశయః ॥**

**తాత్పర్యము:-** బంగారం, భూమి, వేలాది బ్రాహ్మణార్చన, నీరు లేనిచోట బావిని త్రవ్వించుట, దీనులను రక్షించుట మొదలైన వాటి వలన లభించు పుణ్యమునకు కోటిరెట్ల పుణ్యము శివలింగ ప్రతిష్ఠ వలన లభించును.

శివక్షేత్రమందు చేసిన పుణ్యము కోటిరెట్ల ఫలితము నిచ్చును. అదేవిధముగా శివక్షేత్రములో పాపము చేసిన వజ్రము వంటి కఠినమైనది.

శివలింగ ప్రతిష్ఠలో అధివాసము 20 పదార్ధములలో చేయ వలెను. మట్టి, గంధము, రాయి,ధాన్యం, గరిక, పుష్పం, జలం, పెరుగు, నేయి, బియ్యం పిండి, సింధూరము, శంఖజలం, గోరోచనం, తెల్లావాలు, బంగారము, వెండి, రాగి, దీపము, అద్దము అను 20 ద్రవ్యములతో ప్రతిష్ఠకు ముందు అధివాసము చేయవలెను. ఈ విధముగా 3 సార్లు అధివాసము చేయవలెను.

భగ్నమైన, అసంపూర్ణమైన, కుష్ఠురోగి స్పృశించిన దూషిత భూమి యందు పతితమైన శివలింగమును పూజించరాదు. ఇట్లు హీనాంగ ములైన శివలింగములను నీటిలో వదిలివేయవలెను. స్పర్శాది దోషయుక్తములైనచో తిరిగి సంస్కరించి పూజించవచ్చు.

కర్మవల్లే మానవుడు బంధితుడగుచున్నాడు. కర్మక్షయము కానిదే మోక్షము లభించదు. శుభాశుభ కర్మల వల్ల ప్రాప్తించు పాప పుణ్య ములు అనుభవించుట వలనే నశించును. సంకెళ్ళు ఇనుపవైనా, బంగారువైనా బాధించును గదా.

బ్రహ్మాది తృణపర్యంతమూ జగమంతా మాయచే కల్పించబడి నది. సత్యమైన పరబ్రహ్మాను తెలుసుకుని సుఖము పొందవలెను.

నామరూపములను పరిత్యజించి నిశ్చలమైన నిత్యబ్రహ్మ యందు కర్మబంధములను తొలగించుకొని ముక్తుడు కావలెను. జప, హోమ, ఉపవాస శతముల వల్ల ముక్తి లభించదు. మనస్సుచే కల్పించబడిన రూపము మానవులకు మోక్షసాధిని అయినట్లయితే, స్వప్న లబ్ధ రాస్యముతో మానవులందరూ మహారాజులే మగుదురు. బ్రహ్మ జ్ఞానము వలననే మోక్షము లభించును.

**ఉత్తమో బ్రహ్మ సద్భావో ధ్యానభావస్తు మధ్యమః**
**స్తుతిర్జపోధమో భావో బహిః పూజాధమాధమా ॥**

**తాత్పర్యము:-** బ్రహ్మభావము ఉత్తమమైనది. ధ్యానయోగము మధ్యమము, జపము-స్తోత్రము అధమము. విగ్రహారాధన అధమాధమము.

**ఘటస్థం యాదృశంవ్యోమ ఘటేభగ్నే పితాదృశం ।**
**నష్టేదేహే తథైవాత్మా సమరూపో విరాజతే ॥**

**తాత్పర్యము:-** కుండలోపలి భాగము శూన్యము. కుండ పగిలిననూ అట్లే శూన్యములో కలిసియుండును. అట్లే దేహము నశించిననూ ఆత్మ సమభావముగానే యుండును.

గృహస్థ-భైక్షుక ఆశ్రమములలో బ్రహ్మమంత్రోపాశన "ఓం తత్సత్" చేయుచూ గృహస్థ ధర్మములను నిర్వర్తించుచున్ననూ యతుల వలె పూజనీయులగుచున్నారు. పూర్ణాభిషేక విధానములో సంస్కార

వంతుడైన శైవావధూత సర్వశ్రేష్ఠుడగుచున్నాడు. శైవావధూత, బ్రహ్మా వధూతలు, పూర్ణ, అపూర్ణ భేదము చేత తిరిగి రెండు విధములు పూర్ణులైనవారు పరమహంస యని, అపూర్ణులు పరివ్రాట్ అని పిలువబడుదురు. జప, హోమ, ప్రతిష్ఠాదులన్నియు “ఓం తత్సత్” మంత్ర నిష్పన్నములే. ఈ మంత్రము చేత సకలమూ సాధించవచ్చు. ఈమంత్రము రాగిరేకుపై లిఖించి ధరించిననూ గృహము, సింహ ద్వారము వద్ద లిఖించిననూ సర్వశుభములు కలుగును.

హంస, యతులు, స్త్రీసంగమం, ధనగ్రహణం చేయరాదు. ప్రారబ్ధము ననుసరించి లభించినది స్వీకరించి విధి నిషేధ వర్జితులై బ్రహ్మభావమందు సదా విహరింతురు. స్వజాతి చిహ్నములు వదిలి పెట్టవలెను. గృహస్థ ధర్మములు ఆచరించరాదు. స్థిరముగా ఒక గ్రామమునందు నివసించరాదు. కౌళధర్మమునకు మించినది లేదు. సమస్త ప్రాణి పాదచిహ్నములు గజపాద చిహ్నములో లీనమైనట్లు, సర్వధర్మములు కాలధర్మము నందు అంతర్భావము పొందుచున్నవి.

**యధాత్వం బ్రహ్మణః శక్తిర్మమ ప్రాణాధికావరా ।**
**మహానిర్వాణ తంత్రంమే తధాజానీహి సువ్రతే ॥**
**సర్వధర్మాన్వితం తంత్రం నాతః పరతరం క్వచిత్ ।**
**మహానిర్వాణ తంత్రస్య కళాంనార్హంతి షోడశీమ్ ॥**

## శివార్పణమస్తు

మేడవరపు సంపత్‌కుమార్

# నమస్తే

"తాంత్రిక గ్రంధావళి" శీర్షికలో ఇది 5వ పుస్తకము. ఇది "రసార్ణవం" అనే రసతంత్రం. రసవాద విద్య గూర్చి, పాదరసము గూర్చి పరిజ్ఞానము కలిగించును. ఇది 8 పటము లలో 2317 అనుష్టుప్ శ్లోకాలలో రచించబడినది. పాదరసము నకు 8 విధముల సంస్కారము గావించువారు, రసాయన విద్య, ప్రయోగపూర్వకముగా చేయదలచినవారు, నియమ నిష్టలతో ముందు మంత్రసాధన చేసి, అనంతరము రస పండితుల వద్ద కొంత అనుభవము సంపాదించవలెను. రసమును బంధించు, రసమును జారణ చేయు మూలికలు ఇందు చెప్పబడినవి.

డోలాయంత్రము, విద్యాధర యంత్రము, అంధమూస, భూధర యంత్రం, వాలుకాయంత్రం, వజ్రమూస మొదలైనవి అనుభవజ్ఞులైన ఆయుర్వేద వైద్యుల పర్యవేక్షణలో చేయవలెను. కేవలం ధనాశ గలవారికి రసవాదం సిద్ధించదు యోగ్యత, తత్వ దృష్టి, సమభావం, శివానుగ్రహం కలవారికే రసవిద్య సిద్ధిస్తుంది. మన ప్రాచీనవిద్యలలో అతిమహోన్నతమైన ఈ రసవాద విద్య గూర్చి అందరికీ తెలియజెప్పాలనే తపనతోనే

ఈ రచన జరిగింది. ఇక రసవైద్యం –రసవాదం ఈ రెండూ కేవలం ఒక్కరివల్లే అయ్యేవికావు. అనేక వ్యయ– ప్రయాసలు కలుగుతాయి. మూలికా మర్మజ్ఞుల సహాయం ఎంతో అవసరం. వైద్యపరంగా రసం + వివిధ లోహములు + వివిధ మూలికలు, పరిశోధన జరిపి, వివిధ రోగములను తగ్గించు ఔషధములు తయారు చేసిన మానవజాతికి మహోపకారం జరుగుతుంది. అందరూ ఆయురారోగ్యములతో సుఖపడవచ్చు. ఈ దిశగానే రసపరిశోధన జరగాలని నా ఆకాంక్ష. అటువంటి ప్రేరణ పొంది కృతకృత్యులు కావాలని ఆశిస్తూ శివానుగ్రహం అందరికీ కలగాలని, శివుని ప్రార్థిస్తున్నాను.

పుష్యార్కం
30–10–99
కాకినాడ

తంత్ర జిజ్ఞాసువు

***మేడవరపు సంపత్కుమార్.***

**సంస్కృత రసశాస్త్ర గ్రంథముల వివరములకు**

**ఈ మెయిల్ చేయండి.**

e-mail : sampth 2016@yahoo.com

# రసతంత్రము

ఓం రసేశ్వరాయ నమః

## రసరోచిస్సు

**శ్లో॥ సిద్ధేరసే కరిష్యామి నిర్దారిద్ర్యగదం జగత్**
**రసధ్యానమిదం ప్రోక్తం బ్రహ్మహత్యాది పాపనుత్ ॥**

**తాత్పర్యము:-** పాదరసవాద విద్య సిద్ధించినట్లయితే ఈ ప్రపంచంలో రోగబాధ, దరిద్రబాధ లేకుండా చేస్తాను. ఇదే రసధ్యాన శ్లోకం. ఈ శ్లోకపఠనం వలన బ్రహ్మహత్యాది పాతకములు నశిస్తాయి.

అధర్వణవేదం 7-23-4 లో, పాదరసంవల్ల రోగనివృత్తి, అజరామరమైన దేహసిద్ధీ చెప్పబడ్డాయి. చరకుడు, సుశృతుడు, వాగ్భటుడు మొదలైన ప్రాచీన ఆయుర్వేద శాస్త్రవేత్తలు రసప్రాధాన్యాన్ని గుర్తించి వాటి విధానాలు వివరించారు.

**ఆయుర్వేదంలో చికిత్స 4 విధములుగా చెప్పబడింది.**
**ఆధర్వణి, ఆంగీరసి దైవీమనుష్యజా ఉత**
**ఓషధయఃప్రజాయంతే యదాత్వం ప్రాణజిన్వసి ॥**
**అధర్వవేదం - 4-36**

**1. ఆధర్వణి చికిత్స :-** ( మంత్రములతో వ్యాధిని తగ్గించునది.) **2. ఆంగీరసీ చికిత్స :-** (దివ్య ఓషధీ, మంత్ర మిళితము) **3. దైవీ చికిత్స:-** పాదరసము, లోహములతో తగ్గించునది. **4. మనుష్యజా:-** చూర్ణ - కషాయము- లేహ్యములతో తగ్గించునది.

"రసపద్ధతి" యందు రోగచికిత్స 3 విధములుగా ఉల్లేఖించ బడింది. 1. దైవీచికిత్స = రసచికిత్స. 2. మానవీ చికిత్స = ఓషధు లతో చేయబడింది. 3. రాక్షస చికిత్స =శస్త్రముతో కోసి చేయునది. అందుచేతనే

**ఉత్తమో రసవైద్యస్తు మధ్యమో మూలికాదిభిః**
**అధమః శస్త్రదాహాభ్యాం ॥ అని చెప్పబడింది.**

**హిరణ్యధారణ :-** సేవనవల్ల ఓజస్సు, తేజస్సు, బలం, ఆయువు వృద్ధిపొందుతాయని అధర్వవేదం 1-35-3 లో పేర్కొన బడింది. వేదకాలం నుంచీ రసమూ, బంగారము ఔషధములుగా ఉపయోగించేవారని తెలుస్తున్నది.

చరకుడు, అగ్నివేశుని వైద్యతంత్రమును సంస్కరించి చరక
59 సంహిత అనే వైద్యగ్రంధాన్ని రచించాడు. దీని రచనాకాలం సందిగ్ధం
అయినప్పటికీ అల్‌బెరూని - సిల్వన్ లేవీ - హోర్నల్ మొదలైన
వారి మతరీత్యా క్రీస్తుశకం 1వ శతాబ్దిదై ఉండవచ్చని భావిస్తున్నారు.
అయితే చరకుడు సంస్కృత వైయ్యాకరణి అయిన క్రీస్తుపూర్వపు
వాడైన పాణిని కంటే పూర్వుడు. ఎందుచేతనంటే, పాణిని తన
అష్టాధ్యాయములో "కఠ చర కాల్లుక్" - 4-3107 అని చరకుని
పేర్కొన్నాడు. అందుచేత చరకుని కాలం సుమారు క్రీ॥పూ॥ 2 వేల
సం॥లు అయి ఉండవచ్చని పండితుల సిద్ధాంతం.

భారతీయ ఆయుర్వేద వికాసము క్రీ॥పూ॥ 600 సం॥ వరకు
జరిగిందని చెప్పవచ్చు. తక్షశిల, నలంద, కాశీ విద్యాపీఠములలో
టిబెట్‌లోని బౌద్ధ మఠములలో ఆయుర్వేదము యొక్క అధ్యయ
నాదులు జరిగెడివి. చరకుని అనంతరము సుశ్రుతుడు తన
ఆయుర్వేద గ్రంధములో శల్యతంత్రమును విశేషముగా వివరించాడు.
నీచలోహమును ఉత్కృష్టలోహముగా మార్చినపుడే, సాధారణ
దేహమును దివ్యదేహముగా మార్చుటకు తగినదగును. కనుకనే
పాదరసముతో బంగారము చేయుటకు ముందు ప్రయత్నము
చేసెడివారు. ఆధునిక విజ్ఞానశాస్త్ర రీత్యా కూడా మూలకములలో
80 వ మూలకము పాదరసమైతే 79 వ మూలకము ఏయు

బంగారమగుచున్నది. పాదరసము యొక్క అణువులోని నూక్లియన్ లోని 1 ప్రోటాను తొలగించిన అది బంగారు అణువగును. దీని గురించే అనేక మూలికలు, మంత్రములు, భస్మములు, పుటములు మొదలైన శోధనలు జరిగినవి. అందరూ సాధించలేకపోయినా కొందరు సాధించారు. కొందరు వైద్యశ్రేష్టులైనారు.

రసరత్న సముచ్ఛయములో 27 రససిద్ధులు పేర్కొనబడ్డారు. ఆదిమ, చంద్రసేన, లంకేశుడు, విశారదుడు, కపాలి, మత్తుడు, మాండవ్య, భాస్కర, శూరసేనక, రత్నకోశ, శంభు, సాత్విక, నరవాహన, ఇంద్రదద, గోముఖ కంబలి, వ్యాడి, నాగార్జున, సురానంద, నాగబోధి, యశోధన, ఖండ, కాపాలిక, బ్రహ్మ, గోవింద, లంపక, హరి ప్రభృతులు వీరిలో కొందరి గూర్చి వివరములు లభించుచున్నవి.

## ప్రాచీన రసాయనవేత్తలు

1. **వ్యాడి:-** ఇతడు వాహీక దేశమునకు చెందిన రసాచార్యుడు. సంస్కృత వ్యాకరణమును కూడా రచించాడు. ఇతడు రచించిన రసగ్రంధములు లభించుటలేదు.

2. **నాగార్జునాచార్యుడు:-** ఇతడు గొప్ప రససిద్ధుడు. అనేక మహిమలు ప్రదర్శించినవాడు. ఇతడు శాతవాహన, కనిష్క

అశ్వఘోషుల సమకాలికుడు అనగా క్రీ॥పూ 1వ శతాబ్దివాడు. లామాతారానాథ్ ననుసరించి నాగార్జున సిద్ధుడు 529 లేదా 571 సం॥లు జీవించాడు. రసాయనసేవన వల్ల దీర్ఘాయువు పొందాడు. ఆనాటి మహారాజులను తన మహిమలతో ఆకట్టుకుని, వారికి మిత్రుడయ్యాడు.

ఇతడు 1. లోహశాస్త్రము, 2. రసరత్నాకరము, 3. కక్షపుటి, 4. యోగసాగరం మొ॥ అమూల్య గ్రంథములను రచించాడు. చరక–సుశ్రుత గ్రంథములకు వ్యాఖ్యానము వ్రాసిన చక్రదత్తుడు తన రసాయనాధికారములో నాగార్జునాచార్యుని స్తుతించుచూ నాగార్జునుని లోహశాస్త్ర గ్రంథమును గూర్చి ఇట్లు ప్రశంసించెను. "నాగార్జునో మునీంద్రః శశాస యల్లోహశాస్త్ర మతిగహనం తస్యార్థస్య స్మృతయే వయమేతత్ విశదాక్షరైఃబ్రూమః" ఇతడు రచించిన కక్షపుటి మంత్రశాస్త్ర గ్రంథము జగత్ప్రసిద్ధము. నాగార్జునాచార్యుడు రచించిన యోగసాగరము నేపాల్‌లోని పుస్తక భాండారములో వ్రాత ప్రతిసంఖ్య 22–11–32 లో ఉన్నది. 7వ శతాబ్దివాడైన చైనా యాత్రీకుడు హుయాన్‌త్సాంగ్ తన భారత్ యాత్రాదర్శినిలో నాగార్జునాచార్యుని వివరములు పేర్కొన్నాడు. శాతవాహనుని కొరకు నాగార్జునుడు సుహృల్లేఖ అను గ్రంథమును రచించాడు. రసశాస్త్రమును గూర్చి రసరత్నాకరమే ప్రథమ గ్రంథము. ఇందు నాగార్జునాచార్యుడు

మరియు శాలివాహనుడు, రత్నఘోషుడు, మాండవ్యుల మధ్య చర్చారూపముగా ప్రశ్నోత్తర విషయములతో రచన సాగింది.

3. **చర్పటినాధుడు:-** 64 సిద్ధులలో 59వ వజ్రయాన సిద్ధుడు. టిబెట్ పరంపరలో ఇతనిని "మీనపా" యొక్క గురువుగా చెప్ప బడింది. కాని నాథ పరంపరలో ఇతడు గోరఖ్‌నాధుని శిష్యుడు ఇతడు 14వ శతాబ్దికి పూర్వుడు.

# కొన్ని ప్రాచీన రసశాస్త్ర గ్రంధములు

1. **కుబ్జికా తంత్రము:-** ఇది 6వ శాతాబ్దములోని మహాయాన బౌద్ధ సంప్రదాయమునకు చెందినది. నేపాల్ రాజు గ్రంధాలయము లో నున్నది. బీహార్‌లో దర్భాంగా యూనివర్శిటీలో ఒక వ్రాతప్రతి ఉన్నది. ఇందు రసవిద్య వర్ణన ఉన్నది.

8వ శతాబ్దిలో విక్రమశిలలో తంత్రవిద్య ప్రముఖస్థానము నాక్రమించినది. కాక చండీశ్వరతంత్రం దీని రచయిత ఒకయోగి అయిఉండవచ్చునని పండితాభిప్రాయం రసతంత్ర విషయము లిందున్నవి.

# రస హృదయ తంత్రం

ఇది 9వ శతాబ్దకి చెందినది. గ్రంధకర్త పేరు తెలియదు. 19 అవబోధలుగా విభజించబడినది. రసప్రశంస నుంచి రసభక్షణ

విధానము వరకు అనేక విషయములు చెప్పబడ్డాయి. మహారస, ఉపరస, సాధారణరస, విష, ఉపవిష, జంతుద్రవ్య వర్గీకరణలో భేదములు రస గ్రంథములలో నున్నవి. విడము యొక్క పరిభాష నిర్మాణవిధి మొట్టమొదటగా ఈ గ్రంథములోనే చెప్పబడినది. విడమనగా అగ్నిసహాయముచే ఏ లోహమును పర్యాప్త పరి మాణములో జారణ చేయునో అది విడమనబడును. ఇది సౌవర్చలం, త్రికటు స్ఫటిక, కాశీసం, గంధకముల మిశ్రణచే తయారగును.

## చికిత్సా కలికా

ఇది 9వ శతాబ్దికి చెందిన "తీసటు" ని రచన, ఇందు అనేక రోగములకు చికిత్స, రసాయన తంత్రము, వాజీకరణము చెప్పబడ్డాయి.

## రస రత్నాకరం

ఇది 12వ శతాబ్దివాడైన నిత్యనాథ సిద్ధుడు రచించినది. ఇందు 1. రసఖండం, 2. రసేంద్రఖండం, 3. వాదిఖండం, 4. రసాయన ఖండం, 5. మంత్రఖండములున్నవి. రసశాస్త్ర విషయములో రసాయనఖండము చాలా వైశిష్ట్యము కలది. వాజీకరణము, కేశరంజన యోగములు, ఆరోగ్యసిద్ధికర విషయములు పేర్కొన బడినవి.

## రసార్ణవం

ఇది 12వ శతాబ్దికి చెందినదని ఆచార్య ప్రఫుల్లచంద్ర భావి స్తున్నారు. రచయిత తెలీదు. 18 పటములలో 2317 శ్లోకములలో రచించబడినది. తంత్రావతార, మంత్రన్యాసముల నుండి దేహవేధ వరకు వివరించబడింది. ప్రస్తుతం ఈ "రసతంత్రం" ఈ రసార్ణవము నాధారముగా చేసుకొని రచించినది. భైరావానంద సిద్ధుడు దీని రచయితగా పండితులు అభిప్రాయపడుతున్నారు. అనంతర కాలీన రసశాస్త్ర గ్రంధములైన రసేంద్ర చింతామణి, రసరత్న సముచ్ఛయం, సర్వదర్శన సంగ్రహం, యోగతరంగిణీ, రసకామధేను మొ॥ గ్రంధా లలో రసార్ణవం నుండి గ్రహించారు. ఇది చాలా ప్రామాణికమైన, ప్రాచుర్యమైన రసశాస్త్ర గ్రంధము.

## రసప్రకాశ సుధాకరం

ఇది 13వ శతాబ్దికి చెందిన యశోధరుని రచన. ఇతడు గుజరాత్ లోని జూనాగఢ్‌లోని బ్రాహ్మణుడు. ఇది 13 అధ్యాయములలో రచించ బడినది. ఈ రచన తన అనుభవములవల్ల, గురు–శాస్త్రానుశీలన వల్ల రచించినట్లు యశోధరుడు చెప్పాడు. ధాతు కౌతుకమనే 111వ అధ్యాయ ములో "హేమకరణ" పద్ధతులు, తాను చేసినవీ, శాస్త్రములో చెప్పబడి నవీ, 18 వరకూ పేర్కొన్నాడు. కృత్రిమంగా ముత్యమూ, పగడమూ తయారుచేసే విధానం చెప్పబడింది.

# రసరత్న సముచ్ఛయం

ఇది 15వ శతాబ్దికి చెందిన వాగ్భట రసాచార్యుని కృతి. అధ్యయన, అధ్యాపన ప్రయోగములలో ఈ గ్రంథం చాలా ప్రాముఖ్యాన్ని పొందినది. 30 అధ్యాయములు. 11వ అధ్యాయములో 25 రసబంధములు చెప్పబడ్డాయి. పాదరసములోని చంచలత్వం పోగొట్టి, చేతితో తీసుకొనేలా చేసే విధానములు. రసమును కఠినముగా బద్ధము చేసే పద్ధతులు తెలుపబడ్డాయి. ఇవి 1. హఠబంధం, 2. ఆరోటబంధం, 3. అభాసబంధం,4. క్రియాహీనబంధం, 5. పిష్టికాబంధం, 6. క్షారబంధం, 7. ఖోటబంధం, 8. పోటబంధం, 9. కల్కబంధం, 10. కజ్జలీబంధం, 11. సజీవబంధం, 12. నిర్జీవబంధం, 13. నిర్బీజబంధం, 14. సబీజబంధం, 15. శృంఖలాబంధం, 16. ద్రుతిబంధం, 17. బాలకబంధం, 18. కుమారబంధం, 19. తరుణబంధం, 20. వృద్ధబంధం, 21. మూర్తిబంధం, 22. జలబంధం, 23. అగ్నిబంధం, 24. సుసంస్కృతబంధం, 25. మహాబంధం.

# రససారం

ఇది 13వ శతాబ్దికి చెందిన గోవిందాచార్యుని రచన. ఇతడు గుజరాతీ బ్రాహ్మణుడు. ఇతడు అనేక శాస్త్రములు చదివి, అనేకసార్లు ప్రయోగము చేసి రససారం రచించినట్లు చెప్పాడు. రసకర్మకు

సంబంధించిన సకల విషయములు ఇందు చెప్పబడినట్లు, ఇందు లేనిది మరెక్కడా లేనట్లు స్వయముగా చెప్పాడు. రససారం సార్ధక నామధేయమైనది. 9వ పటలములో టిబెట్ బౌద్ధులు ధాతువాద విద్యలో గొప్పవారని పేర్కొన్నాడు. ఇది 26 అధికారములలో రచించ బడింది. రస, ఉపరస ధాతువుల రంగద్రావక్రియ ఏ శాస్త్రములోనూ చెప్పలేదని బౌద్ధుల ద్వారా తాను గ్రహించినట్లు చెప్పాడు హేమబీజ. తారాబీజ వివరములు 11వ పటలములో చెప్పబడ్డాయి. శతవేధి, లక్షవేధి, కోటివేధి, హేమ, తార బీజములు వివరించాడు. ఒక భాగము రసబీజము, 100 భాగముల అన్యలోహ పదార్ధమును బంగారముగా మార్చునది శతవేధి అంటారు.

## రసేంద్ర చింతామణి

ఇది 14వ శతాబ్దివాడైన ఢంఢకనాథుని రచన. గద్య పద్యా త్మకముగా 9వ అధ్యాయములో రచించెను. ఇది అనుభవంతో పరీక్షించి వ్రాసినట్లు పేర్కొన్నాడు.

## రసేంద్రసార సంగ్రహం

ఇది 14వ శతాబ్దివాడైన గోపాలకృష్ణభట్టు రచన. 2 అధ్యా యములలో 719 శ్లోకములు రచించబడినవి. ఇందు స్వర్ణభస్మ విధి, ధాతు, రసమారణములు, రసౌషధముల తయారీ చెప్పబడింది.

# సువర్ణ తంత్రం

ఇది శ్రీరామ–శివ సంవాద రూపముగా చెప్పబడినది. రచయిత నామము, దేశకాలములు తెలియవు. ఇందు అనేక ఆశ్చర్యకరమైన రసవిజ్ఞాన విషయములున్నవి.

ఇంకా రససంకేత కలిక (కాయస్థ చాముండుడు 16వ శతాబ్ది) ధాతుక్రియ (17వ శతాబ్ది రచన) యోగరత్నాకరం (మయూర పాదభిక్షు 17వ శతాబ్ది రచన) రసేంద్ర చూడామణి (సోమదేవుడు 12వ శతాబ్ది) భావప్రకాశ (భావమిశ్రుడు 16వ శతాబ్ది) కంకాలీయ రసాధ్యాయం (14వ శతాబ్ది) రసరాజం (విష్ణుదేవుడు 14 AD) రసరత్న ప్రదీపం (15 AD) రసకౌముది – రసకామధేను (16 AD) తోడరానంద (తోడర్‌మల్ 16వ శతాబ్ది) మొదలైన అనేక గ్రంథములున్నవి.

సుమారు 183 రసగ్రంథములున్నవి. కొన్ని ప్రచురణ పొంది నవి. కొన్ని తాళపత్ర గ్రంథరూపముగానే యున్నవి.

**రసోవై సః**

తంత్ర జిజ్ఞాసువు

మేడవరపు సంపత్కుమార్.

ఓం హ్రీం శ్రీం

# రసతంత్రము

శ్లో॥ యస్మిన్ సర్వం యతఃసర్వం యఃసర్వం సర్వతశ్చయః
యశ్చ సర్వమయో నిత్యంతస్మై సర్వాత్మనే నమః॥
కైలాస శిఖరే రమ్యే నానారత్న విభూషితే
నానాద్రుమ లతాకీర్ణే గుప్తసంబంధ వర్జితే॥
దేవదేవం సుఖాసీనం నీలకంఠం త్రిలోచనం
ప్రణమ్య శిరసాదేవీ పార్వతీ పరిపృచ్ఛతి॥

అందమైన కైలాస శిఖరము వివిధ వృక్షలతలతో, రమ్యమైన రత్నములతో అలరారుతున్నది. సుఖాసీనుడైన దేవదేవుడు పరమేశ్వరునికి శిరసా నమస్కరించి పార్వతి ఇట్లు ప్రశ్నించినది.

మహాదేవ, కౌళాది వామమార్గనాశక, నీ అనుగ్రహము చేత అనేక విజ్ఞాన విషయములు తెలుసుకొంటిని. ఏ తంత్రమునందు చెప్పని "జీవన్ముక్తి" గురించి వివరించుము స్వామీ!

భైరవుడిట్లు పలికెను. హే పార్వతీ! భక్తుల హితము కోరి నీవు అడిగినది బాగుంది. అజరామరమైన దేహముతో శివతాదాత్మ్యము పొందు జీవన్ముక్తి దేవతలకు కూడా దుర్లభమైనది. మరణానంతరము పొందు మోక్షము నిరర్థకమైనది. కేవలం శరీరం నశించిన ముక్తి రాదు. ఇదే నిజమైనచో సకల పశువులు ముక్తిపొందును. శుక్ర, శోణిత, మూత్రపురీష సేవన అనుసరించుచు వామమార్గమందు కూడా ముక్తి లభించదు. షట్ దర్శనములందు వివరించు ముక్తి చేతియందున్న ఉసిరిక వలె ప్రత్యక్షము కాదు. పుణ్యాత్ములు, మంత్ర వేత్తలు, యజ్ఞములు చేయువారు కూడా ఎల్లకాలము శరీరధారణ చేయలేరు. శరీరము ధరించి చిరంజీవిత్వముగా నుండుట దేవతలకు కూడా దుర్లభము. ఇక మానవుల విషయము చెప్పనేల? శరీర నాశనము చేత ధర్మము, క్రియలు సమస్తమూ నశించును. అందుచేత సర్వయత్నముగా శరీరమును రక్షించవలెను. ఈ చిరకాల శరీరధారణ 1. రసము (పాదరసము), 2. వాయువు (ప్రాణవాయువు), ఈ రెండు విధములుగా సాధించి బ్రతికియుండగనే ముక్తిని సాధించ వచ్చు.

**మూర్ఛితో హరతేవ్యాధిం మృతో జీవయతి స్వయం**
**బద్ధఃఖే చరతాం కుర్యాత్ రసోవాయుశ్చ భైరవిః ॥**

పార్వతీ! పాదరసము, ప్రాణవాయువు ఈ రెండూ మూర్ఛిత మైనచో వ్యాధినాశనమును, మృతమైనచో జీవనమును, బంధన పొందినచో ఆకాశగమనత్వము కలిగించును. పాదరసము మూర్ఛిత మవటమంటే - గంధకం, చందనం, అగరు మొ॥ ద్రవ్యములతో మూర్ఛన సంస్కారం పొంది రక్తసింధూరం మొ॥ రూపములతో రోగము వలన పోగొట్టు శక్తిని పొందును. మృతమనగా భస్మము. శుద్ధరస భస్మము మానవునికి జీవనము కలిగించును. బంధనమనగా రసగుటిక. ఇది ఖేచరత్వము నిచ్చును. ప్రాణవాయువు కూడా ఈ 3 రకముల సంస్కారములు పొందినచో విశేష ఫలితముల నిచ్చును. (ప్రాణాయామము మొ॥ విషయములు, శివసంహిత మొ॥ గ్రంథము లందు వివరించబడినవి) జ్ఞానమువలన మోక్షము కలుగును. ఈ జ్ఞానము శరీరధారులకే సాధ్యము కాబట్టి శరీరధారణ పాదరసము వలనే సంభవము. అచిరకాలములోనే శరీరము అజరామరమగును. రసయోగము వలన మనస్సు ధ్యాన మగ్నమగును. శరీరమునకు జరామరణము లుండవు. మృతరస సేవన వలన మంత్రసిద్ధి కలుగును.

**తస్యమంత్రాశ్చ సిధ్యంతి యోశ్నాతి మృతశూతకం**

మద్య–మాంసాది సేవకులగు తామసగుణము కలవారికి రసజ్ఞానము దుర్లభం.

**గోమాంస భక్షయేద్యస్తు పిబేదమర వారుణిం ।**

**కులీనం తమహంమన్యే రసజ్ఞమపరే ధమాః ॥**

**తాత్పర్యము:-** గోమాంస భక్షకులు, సురాపానమత్తులు వీరే గొప్ప రసవేత్తలు. ఇతరులు అధములు అనగా – గోమాంసం అంటే ఆవుమాంసం కాదు. గో అనగా నాలుక. నాలుక చివరి భాగమును అంగుటియందు గల ఊర్ధ్వ రంధ్రములో ప్రవేశింపజేసి, సురా పానము అనగా శిరస్సులోని పీయూష గ్రంధినుండి (పీనియల్ గ్లాండ్) స్రవించు అమృత రసబిందు పానము చేసి ఆనందించు వారే రసజ్ఞులు. ఇతరులంతా అధములే.

అసలు గర్భమనగా రసమే గర్భము. కారణమేమనగా దీని యందే ఉపరస, మహారస ధాతువులు సకలమూ లీనమగును. దీని సేవన వలనే "కాయసిద్ధి" కలుగును. శివమాయ చేత మద్య–మాంసరతులు మేము ముక్తులమని గొప్పలు చెప్పుదురు. దేహసిద్ధి పొందిన కానీ శివతత్వము ప్రాప్తించదు. ఇది రససిద్ధి వలననే లభించును. జగమునకు మనము మాతాపితరులము మనయొక్క మహామైధున సంభవము పాదరసము. నాయొక్క దేహరసముగా

బయలు వెడలినది కనుకనే దీనికి "రస" మని పేరు. దీనిని దర్శించినా, స్పర్శించినా, భక్షణ చేసినా, స్మరించినా, పూజించినా, దానము చేసినా, "పుణ్యఫలము" కలుగును. కేదారాది లింగములు భూమిపై ఎన్ని కలవో, వాటి దర్శనఫలము రస దర్శనము వలన లభించును. చందనాగరు కర్పూర కుంకుమ మధ్య మూర్ఛిత రసము నుంచి శివపూజ చేసిన శివానుగ్రహము కలుగును. శుద్ధ పాదరస భక్షణ వలన సకలపాములు నశించును. (శుద్ధ పాదరస భక్షణ చేయువారు ముందుగా శరీరమును క్షేత్రీకరణ పద్ధతుల ద్వారా శుద్ధి చేసుకొనవలెను. లేనిచో ప్రాణాపాయము సంభవించును.) అభ్రకజారణ చేసినచో పాదరస సేవన వలన రోగములు నశించును. వేయి స్వయంభూలింగార్చన ఫలమునకు కోటిరెట్లు ఫలితము "రస లింగార్చన" వల్ల లభించును.

**శ్లో॥ స్వయం భూలింగ సాహస్రైః యత్ఫలం సమ్యగర్చనాత్**
**తత్ఫలం కోటిగుణితం రసలింగార్చనాద్భవేత్ ॥**
**అధమః ఖగవాదస్తు విడవాదస్తు మధ్యమః**
**ఉత్తమో మంత్రవాదస్తు రసవాదో మహోత్తమః ॥**

పాదరసలింగ నిర్మాణము అనేక విధములుగా కలదు. వాటిలో

**1. ఖగవాదము:-** అభ్రకముతో రసలింగము చేయు విధానము కలదు. ఇది అధమమైనది.

**2. విడవాదము:-** వివిధ విడములచే రసలింగము చేయునది మధ్యమం. **3. మంత్రవాదము:-** మంత్రములచే పాదరసలింగము చేయు విధానము, పూజ ఉత్తమమైనది. **4. రసవాదము, కర్పూరము** మొదలైన వాటిచే చేయు రసలింగ నిర్మాణము, పూజ మహోత్తమమైనది.

మంత్ర–తంత్రములను, రసయోగమును దూషించువారు పుణ్యమును కోల్పోయి పాపులగుదురు. "రసవిద్య" మూడు లోకముల లోనూ సుదుర్లభం. దీనివలన భుక్తి–ముక్తి రెండూ సిద్ధించును. సద్గుణులైన వారికి రసవిద్యాదానము చేసిన పుణ్యము కలుగును. సద్గురువు దేశకాలములు తెలిసినవాడు, దయాదాక్షిణ్యములు కలవాడు, లోభమోహములు లేనివాడు, మంత్రానుష్ఠాన తత్పరుడు, గంభీరుడు, సాముద్రిక శాస్త్రోక్త శరీరావయవములు కలవాడై యుండవలెను. శిష్యుడు కూడా వినయవంతుడు, సత్యవాది, ధృడ నిశ్చయము కలవాడు అయివుండాలి.

## నిధి సాధకులు

ఎవని హస్తములో కుండ, జెండా, శంఖము మొ॥ చిహ్నాము లుండునో వారినే నిధి సాధించుటలో నియోగించవలెను. ఎర్రటి జుట్టువారు కఠినశరీరులు, ఎండిన లలాటము కలవారు, ఉష్ణ పాదులు, ధాతువాదమునకు యోగ్యులు రససిద్ధి సాధనలో, రసదీక్ష

గ్రహించి ముందు మంత్రసాధన చేయవలెను. లేనిచో రసవాదము సిద్ధించదు. రససాధనలో యోగ్యులైన స్త్రీలను కూడా సహాయకులుగా స్వీకరించవచ్చు. వారు సదాచారవంతులు, శీలవంతులూ అయి ఉండవలెను. కృష్ణపక్షమందు ఋతుమతి అగునది కీకణి, శుక్లపక్ష మందు మాత్రమే ఋతుమతి అగు స్త్రీ కాంచికాచిని. పద్మినీజాతి స్త్రీలు రసకర్మయందు యోగ్యులు.

యోగ్యరాలైన స్త్రీ అగుటకు సాధకురాలు తన తల్లితండ్రులను శివపార్వతులుగా భావించి, నిర్మలబుద్ధితో ఖేచరీముద్రతో "ఫేత్కార భైరవీ" మంత్రం (ఊంహూం ఫట్ స్వాహా) 1 లక్ష జపం చేయాలి. ఇటువంటి స్త్రీని సహాయకురాలిగా తీసుకోవచ్చు.

## రసకర్మకు స్థానము

నిర్జన స్థానములో, ఏ విధములైన ఇబ్బందులు లేనిచోట సురక్షిత ప్రదేశములో రసకర్మ ప్రారంభించవలెను. హృదయాహ్లాదకరమైన ప్రకృతి, ఓషధులు గల ప్రదేశము, జలాశయములు, వివిధ పుష్ప-ఫల వృక్షములతో నిండినది. పక్షిగణములతో కూడినది అయి ఉండ వలెను. మధ్యన మంటపం నిర్మించి, ముందుగా గణపతి పూజ చేయాలి. అనంతరం "రసాంకుశదేవి"కి, రసేశ్వర మూల మంత్రముతో (ఓం హ్రీం శ్రీం) ఆవాహన చేసి పూజ చేయాలి.

పీఠము పై రసలింగము బంగారము ఉంచాలి. హస్తప్రమాణ చతుర స్రవేదిక నిర్మించి అష్టదిక్పాలకులను పూజించి, పూర్వాదిక్రమముగా మాక్షికం,విమలం, మనఃశిల, చపలం, రసకర్పూరం, సస్యకం, గంధకం, హరతాళం ఉంచాలి.

అనంతరం త్ర్యంబకేశ్వరుని ఆరాధించాలి. 22 అక్షరముల రసేశ్వర మంత్రముతో రసభైరవుని అర్చించాలి. (ఓం క్రీం రసేశ్వ రాయ మహాకాలాయ మహాబలాయ అఘోర భైరవాయ వజ్రవీరక్రోధ కంకాళ క్ష్రాం క్షః) అనంతరం రససిద్ధికి పంచబీజ విద్యతో (ఐం హ్రీం శ్రీం క్లీం హ్రీం) శివునికి, రసాంకుశదేవికి షోడశోపచార పూజ - శాంతిపాఠం చేయాలి. ఘంటానాదం చేసి అఘోర మంత్రంతో సర్వవిఘ్న నివృత్యర్థం భూత-యక్ష - రాక్షస - పిశాచు లకు బలి నివేదన చేయాలి.

అనంతరం రసాంకుశీ విద్యను యధాశక్తి జపించి - యోని, మేఖలతో కూడిన "హోమకుండము" నందు నేయి, తిలలు, హోమం వేయాలి. పంచబీజ మంత్రమును 1 లక్ష జపించాలి. అప్పుడే రసభైరవసిద్ధి కలుగుతుంది. సత్యం, అహింస, పరద్రవ్యం తీసుకొన కుండా ఉండుట, బ్రహ్మచర్యం, దయ నియమములు పాటిస్తూ రసాంకుశీ మంత్రములు మూడువేళలా వెయ్యి లేదా వంద సార్లు జపించాలి.

ఇటువంటి మంత్రవేత్తలకే ఓషధులు ఫలించును. రసాంకుశ జ్ఞానము లేనిదే రససిద్ధి కలుగదు. సంప్రదాయము తెలిసిన గురువు వద్ద దీక్ష గ్రహించాలి.

మంటపమునకు తూర్పున ఓషధులు, ఆగ్నేయములో రసప్వేదన సామగ్రి, దక్షిణములో లోహమారక వస్తువులు, నైరుతిలో నూరుట కుపయోగించు కల్వము, పడమరలో ద్రుతిక్రియా సామగ్రి, వాయవ్యములో ఊదుటకుపయోగించు సామగ్రి, ఉత్తరములో రంగు పెంపొందించు ద్రవ్యములు, ఈశాన్యములో రసవేధ కుపయోగించు ద్రవ్యములను ఉంచవలెను.

## రసభైరవుని ఆకారము

శివుని పంచముఖములలో సద్యోజాతము రసభైరవుని మోకాలు, వామదేవుడు గుహ్యస్థానము–అఘోరము– హృదయము– తత్పురుషుడు ముఖము–ఈశానుడు భ్రూమధ్యభాగము అర్ధ చంద్రుడు లలాటము, బ్రహ్మరంధ్రమందు శక్తి ఉన్నది. సాధకుడు ఏకాగ్రచిత్తముతో, ఉన్మనీభావము చెందవలెను.

## రసభైరవ ధ్యానము

**శ్లో॥ శూన్యం శూన్యం పునః శూన్యం త్రిశూన్యంచ నిరామయం**
**నభశ్చ గగనంవ్యోమ ఖమాకాశం చకేవలం**
**నిష్కలం నిర్మలం నిత్యం నిస్తరంగం నిరామయం**

**నిష్ప్రపంచం నిరాధారం నిర్గుణం గుణగోచరం**
**ఏవం రూపం సదాధ్యాయేత్ స్వదేహే రసభైరవం॥**

రసభైరవుని నిశ్చల మనస్సుతో ధ్యానము చేయుట వలన అగ్ని మధ్యమందు పాదరసము బంధమగును. మంటప బహిః ప్రదేశము నందు, మద్య-మత్స్య-మాంసములతో యక్ష, గంధర్వ, రాక్షసులకు అర్చన చేయవలెను.

రససిద్ధి కలిగిన తరువాత, రసాయన వస్తువులను నాశనము చేసి, ఆ గ్రామము వదిలి వేయవలెను. **మహా రససిద్ధి కలిగిన అనంతరము మధుకరవృత్తి (భిక్షావృత్తి) చేయుచూ జీవించవలెను.** రసబంధమైన పిమ్మట ఏమైనా విఘ్నములు కలిగినచో, శాంతి విధానములో రసశాంతి చేయవలెను. రసక్షోభము చేయరాదు.

సిద్ధమైన పాదరసము స్త్రీ హస్తములో ఉంచరాదు, చూపించరాదు. ఇతరుల ధనముతో రససిద్ధి ప్రయత్నములు చేయరాదు. పరస్త్రీ స్పర్శ, పరాన్నభోజనం నిషిద్ధం. సిద్ధరసము దుష్టులకు ఇవ్వరాదు. అష్టమి, చతుర్దశి, అమావాస్య, పున్నమి, ఉగాది, విషువత్ రోజులలో, యధాశక్తి రసోత్సవము చేయాలి.

రసోత్సవము చేయుటవలన మహాపాపములన్నియు నశించును. సాధకుడు రసపూజ చేయు ప్రతీస్థానమునందు, సకల కష్టములు తొలగి, సుఖసంతోషములు, శుభములు కలుగును.

# రససాధన పాత్రలు

17 అక్షరముల కాళీమంత్రము, రసము నూరు రాతికల్వము పై న్యాసము చేయవలెను. 32 అక్షరములు ఘోరమంత్రము మర్ధకముపై న్యాసము చేయవలెను. కాలపాశ మంత్రముతో (క్రీం) గంజిని అభిమంత్రించాలి. 88వేల దివ్యఖేచరీగణము, రసభైరవుని దాసీగణము "సోహం హంసః" అను మంత్రమును జపించుట వలన రసపేషణ కర్మయందు, ఖేచరీ గణము అదృశ్యముగా సహాయపడును. దీనినే "కులఖేచరీ" విద్య అని ప్రసిద్ధి. సైంధవలవణముతో గంజి తయారుచేసి రసాంకుశీ విద్యను జపించాలి. బెల్లము, ఇటుకపొడి మిశ్రమముతో రసమర్ధన త్రిశరామంత్రముతో (ఓం హ్రీం క్లీం) చేయవలెను. డామర మంత్రము వాయునాళికలందు, చింతామణి మహావిద్య కవచములందు చండికా మహామంత్రము రసపాత్ర యందు న్యాసము చేయవలెను. నవాక్షరిని ఊక, గోమయమందు, గంజియందు త్రిపురభైరవిని, అగ్నియందు త్రికూటాక్ష త్రినేత్రుని నీటియందు 84చండికలను న్యాసము చేయవలెను. కోష్టములో అఘోర, క్షేత్రపాలకులను, మూసయందు మహా పాశుపతాస్త్ర మంత్ర మును న్యాసము చేయవలెను. ఈ విధముగా రసకర్మయందు ఉపయోగించు సకల సామగ్రిని మంత్రపూతము చేయవలెను. అనంతరమే రసకర్మను ప్రారంభించాలి. రసము సిద్ధించు సమ

యమున, సాధకుడు మనసులో రసాంకుశ మహామంత్రమును జపించాలి. ఈ మంత్రముచే మూడు లోకములు వశమగును.

పాదరసము డోలాస్వేదన చేయు మూలికలు. ఈ క్రింది ఓషధుల పుష్ప, మూల, దళములు, పాదరసమును డోలాస్వేదన చేయుటలో ఉపయోగించును. సర్పాక్షి, వహ్నికర్కోటి, జలబిందుజా, పిల్లపీచరా, గుంటగలరా, శరపుంఖ, గలిజేరు, మండూకపర్ణి, మత్స్యాక్షి, బ్రహ్మదండి, శిఖండిని, కాకమాచి, కపోతికా, విష్ణుక్రాంతా, సహదేవి, మహాబలా, నాగబల, చక్రమర్ధ, కురుంగిణి, చిరుబొద్ది, నీలి, స్వాలిని, పద్మచారిణి, గోజిహ్వా, ఫణిజిహ్వా (గరిక), కోకిలాక్షి (గొబ్బి), ఘనధ్వని, ఆఖుపర్ణిత్రిపర్ణి (కొలపొన్న), ద్విపర్ణి, ఏకపర్ణి (కచ్చూరం) తిత్తిడీ, క్షీరిణి రాసన, మేషశృంగి (మృదారు శృంగి) కుక్కుటి, కృష్ణపర్ణి (కృష్ణతులసి) తులసి, కొండమల్లి.

## పాదరసమును నిర్జీవము చేయు మూలికలు

చండాలి, రాక్షసి, కంటకారి, గజకర్ణికా, శంఖపుష్పి, లాంగలి, (నీటిపిప్పలి) బాలమోచక, ఎర్రజెముడు, రక్తికా (పెద్దగోరింట) నల్ల చిత్రమూలం, శృగాలజిహ్వా – వజ్రీ (ఆకుజెముడు) చక్రి, ఏకవీర, రుదంతి (అడవి శనగ) తెల్లగురువింద, సూరణవింద, తెల్లతులసి, జమ్మి, పసుపు జటామాంసి నరజిహ్వా, హేమపుష్పి (నేలతంగేడు) కాకముండి, అమృతవల్లి (తిప్పతీగ) గజారి, తమలపాకు, సూర్యభక్త

(ప్రొద్దుతిరుగుడు), అజమోద, సోమలత, వనరాజి, అజమారి, కోటరాక్షి, హనుమతి, కాలికా, కుహకం వికాక్షిరకంచుకి, ఎఱ్ఱచిత్ర మూలం, శాఖోటకం (తపసి) బ్రహ్మచారిణి కాంచని (పసుపు) ఓషధులు, పాదరసమును చాంచల్య దోషరహితముగా చేయును.

## పాదరస మారణ మూలికలు

కటుతుంబి-దేవదాళి-ఇంద్రాయణి తెల్లవావిలి, మోదుగ విత్తన ములు, ప్రత్తికాడలు, నల్లజీలకఱ్ఱ,క్షిరకంచుకి-నల్ల ఉమ్మెత్త తెల్లజిల్లేడు పిపీలుకం -చింతకర్కోటి, (అగాకర) కాకర, గోజిహ్వా- కాకజంఘ(వెలమ సంధి) మహాకాళీ (కాకిదొండ) శంబరి. తెల్ల గురివింద, తెల్ల ఊడుగ, మారేడు వీటి విత్తనములు రసమారణము చేయును.

## పాదరస బంధ మూలికలు

ఎఱ్ఱజెముడు, సోమలత, రుదంతి, (అడవి శెనగ) ఎఱ్ఱ చిత్ర మూలం, శాఖోటకీ (తపసి) దుగ్ధరుహ ఈ మొక్క (కాలిపోయిననూ తిరిగి చిగురించు ఒక మహా ఔషధీ) మోదిని, విధారా (మయ్యాకు పొన్న) కృష్ణ మార్జారి, శంఖపుష్పి, కాకమాచి, నీలజ్యోతి, (సిద్ధమూలిక) తృణజ్యోతి (దివ్యౌషధి) ఉత్కటా, హేమవల్లరి (జీవంతి) త్రిదండి, బ్రహ్మదండి, చక్రాంకి, మెట్టతామర, నాగజిహ్వా, నాగకర్ణి, త్రశూలి, త్రిఫలాకార పత్రాయా శమ్యాకఫలవత్ దళా త్రిశూలి నీతి విఖ్యాతా) త్రిఫలంవంటి ఆకులు, గలిగిరేల పండ్లవంటి పండ్లు కల్గియుండును.

త్రిదండి శ్లో. సపుష్పాలలితో పేతా రక్తవ్యస్త ఫలాన్వితా రసబంధ విధౌప్రోక్తా త్రిదండీతి కృతాభిధాః రసకామధేను) కోమల మైన పువ్వులు కలిగి అక్కడక్కడా ఎర్రపండ్లతో ఉండును). వీరవల్లి (రక్తాక్షీరవతీ బిల్వ దళౌపమ దళాన్వితా ॥ రసకామధేను॥ ) ఎర్రటి పాలు కలిగి మారేడు ఆకులు వంటి ఆకులు కలిగి యుండును.

## పాదరస ద్రావణ మూలికలు

గజపిప్పలి, అరటి, కోశాతకి (బీర), సూరిణ కంద, ఉదకకణ, కాకమాచి, ములగ, దేవదాళీ ఇవి రసద్రావణం చేయును. వీటి సంయోగము వలన ధాతువుల పాదరసము యొక్క దోషములు తొలగును.

## పాదరస క్రామణ మూలికలు

కాకమాచి, కాసమర్ధ,(కసివింద) కృతాంజలి, వరాహకర్ణి (అశ్వగంధ) సీటరి, హంసపాది, పిల్లపీచర, తమలపాకు, నాగిని, (శ్లో– నాగినీత్యుచ్యతే వల్లీ నామభోగ సమాంగికా! సర్పాదిక విషఘ్నీ చ సా స్వచ్ఛ రసబంధినీ ॥ రసకామధేను) – నాగినీ అనునది ఒకతీగ, దీనికి పడగలవలె అకులు కలిగి, సర్పాకారములో తీగ ప్రాకును. ఇది సర్ప విషమును హరించును. రసబంధము చేయును.) అర్జుని (మద్ది) క్షీరనాళి, జిల్లేడు అకులు, చవి కురవకం (ములు గోరింట) కాకర.

# అష్టమూలికలు

భూపాటలి, కౌమారి, సింహవల్లి శూకరి, ఉమ్మెత్త, పాటలి, తమలపాకు, భృంగరాజ, (గుంటగలగర). ఇవి రసశోధన– జారణలో ఉపయోగించును.

# పంచరత్న మూలికలు

మంత్ర సిద్ధాసన, కంకాళ ఖేచరి, ఇందిర, క్షమాపాలి, నిశాచరి ఇవి రసశోధన జారణలో దివ్య ఓషధులు. రసబంధనములో గ్రహించు మూలికలు రసాంకుశ మంత్రముతో తీయవలెను. ఈ పంచరత్న మూలికలు రస సంయోగముచే ఖేచరీ సిద్ధి కలుగును.

త్రిక్షారములు, టంకణక్షారము, యవక్షారము, సర్జికాక్షారము. ఇట్లే, వృక్షక్షారములు కూడా కలవు. నువ్వులు, ఉత్తరేణి, అరటి, మోదుగ, ములగ, అల్లం, చింత, వీటి క్షారములను వృక్షక్షారము లందురు.

**పంచలవణములు**:- సముద్రం, సైంధవం, నవాసారం, సౌవర్చల, (నల్లఉప్పు) కాచం (గాజుప్పు).

**పంచమహా విషములు**:- సక్తుకం, కాలకూటం, తెల్లముస్త, శృంగి, నల్లవిషం.

**పంచఉప విషములు**:- జెముడు,జిల్లేడు, ఉమ్మెత్త,గన్నేరు, లాంగలి, 5 ఉపవిషములు.

**పంచతైలములు:-** కుసుంభతైలం, కంగుణి, నక్తా, నువ్వుల నూనె, ఆవనూనె.

**పంచమూత్రములు:-** ఏనుగు, గుర్రం, మేక, స్త్రీ, ఆవు, వీటి మూత్రములు పంచమూత్రములు.

**పంచపిత్తములు:-** చేప, ఆవు, గుర్రం, మనిషి, నెమలి వీటి వసలు.

**పంచపురీషములు:-** పావురం, గ్రద్ద, నెమలి, కోడి, పాలపిట్ట. వీటినే విట్‌పంచకం అంటారు.

**రక్తవర్గు:-** మంజిష్ఠం, కుంకుమ, లక్క, చంద్ర, విజయ సారం. ఇవి రక్తవర్గు ద్రవ్యములు. మోదుగ, పసుపు మదయంతి, కుసుంభం, కుచందనం. ఇవి పైత్యవర్గు ద్రవ్యములు.

సున్నం, శంఖం, ఆల్చిప్ప, గవ్వ, తాబేలుడిప్ప శుక్లవర్గు ద్రవ్యములు. గురువింద, టంకణం, తేనె, నెయ్యి, బెల్లం ఇవి ద్రావణ పంచకములు.

**అన్నిరకముల క్షారములు మలములను హరించును. ఆమ్ల పదార్థములు ప్రబుద్ధము చేయును.** విషములు తమోగుణము పోగొట్టును. తైలములు మార్దవం కలిగించును.

## అభ్రకం

ఇది పార్వతీదేవి రజస్సు. పీతాభ్రకం (Zinnwaldite), కృష్ణాభ్రకం(Biolite) శుక్లాభ్రకం (Museavite), రక్తాభ్రకం (Lepidolite),

వర్ణములుగా నాలుగు రకములు లభించును. పినాకం, దుర్ధురం, నాగం, వజ్రమని నాలుగు తరగతులు. వీటిలో పినాకాభ్రకం అగ్ని యందు వేసినచో చిటపటలాడును. దుర్ధురాభ్రకం అగ్నియందు వేసిన బుసబుసలాడును. వజ్రాభ్రకం అగ్నియందు వేసిన ధ్వని చేయదు. స్థిరముగా నుండును. పినాకాభ్రకం కుష్ఠరోగమును కలిగించును. దుర్ధరం మరణమును, నాగాభ్రకం రోగమును (భగందర వ్యాధి) ఇచ్చును. రస, రసాయన కర్మలలో వజ్రాభ్రకమునే ఉపయోగించాలి. లేచకిట్టం (అభ్రక కిట్టమును) అసలు ఉప యోగించరాదు.

## అభ్రక స్వేదన మూలికలు

అగస్త్య పుష్పరసం, కమలరసం, కపి – తిందుక, నిమ్మ, మేఘ నాదం, గలిజేరు, చింత, గంజి, ఆమ్లరసం, గన్నేరు, అల్లంతైలం, జమ్మిరసం, వజ్రవల్లి వీటి రస కషాయములలో 3 రోజులు డోలా యంత్రములో స్వేదన చేయాలి. అపుడు అభ్రకములోని దోషము హరించును. ధాన్యాభ్రకం – అభ్రకంలో దానిలోని 4వ వంతు ధాన్యములో కలిపి కంబళిలో ఉంచి 3 రాత్రులు నీటిలో నానబెట్టిన తరువాత నూరి కంబళీ నుండి బయటికి వచ్చిన దానిని గ్రహించాలి. కంబళిలో రాయి, ఇసుక ఉండిపోతుంది. దీనినే ధాన్యాభ్రకం అంటారు.

# అభ్రక ద్రావణ విధి

"రసార్ణవం" లో 16 పద్ధతులు చెప్పబడ్డాయి.

# కాంతపాషాణం

దీనినే కాంతలోహపు అయస్కాంతం అంటారు. ఇది భ్రామకం, చుంబకం, కర్షకం, ద్రావకం అని నాలుగు రకములు. ఇందు కర్షక, ద్రావక, కాంత పాషాణములు రస రసాయన కర్మయందు ఉప యోగించును. పాదరసము మత్త గజేంద్రమయితే దానిని వశము చేసుకొను అంకుశము వంటిది ఈ పాషాణము.

# వజ్రము

ఇది శ్వేత, కృష్ణ, రక్త, పీతవర్ణములలో లభించును. గుండ్రముగా, సమఫలకములు గలది పురుష వజ్రము. రెండవది విషయుక్తమైనది స్త్రీ వజ్రము. దీర్ఘ, త్రికోణ, అండాకారము గలది. నపుంసక వజ్రము, పురుష వజ్రములు తేజోవంతమైనవీ రసకర్మ యందు ఉపయోగించును. "వజ్రభస్మ" విధానములు 16 పేర్కొన బడినవి.

# వజ్ర మృదుకరణ విధి

**శ్లో॥ నాగవల్యా ప్రలిప్తంతు తత్పత్రేణైవ వేష్టితం**
**జానుమధ్యే స్థితంయామం మృదు సంజాయతే ధృవం ॥**

**తాత్పర్యము :-** తమలపాకు నూరి ఆ ముద్దతో వజ్రమునకు లేపనము చేసి, ఒక తమలపాకులో చుట్టబెట్టి మోకాలి మడమలో 1 జాము (మూడుగంటలు) ఉంచిన, వజ్రము మృదుత్వము పొంది భేదన యోగ్యమగును.

## వైక్రాంతం

లోహములను వికృతముగా చేయును. కనక వీటిని వైక్రాంతము లని అంటాము. మహిషాసుర రక్తము భూమిపైబడి ఆ ప్రదేశము లందు వైక్రాంతము లేర్పడినవి. ఇవి నాల్గు వర్ణములలో లభించును.

## అష్ట మహారసములు

మాక్షికం, విమలం, శిలాజిత్, చపల, రస, కర్పూరం, సస్యకం, దరదం, సౌవీరాంజనం ఇవి మహారసములు.

## మాక్షికం

ఇది హేమ మాక్షికం, తారమాక్షికం అని రెండు రకములు. మొదటిది కొంత బంగారు వర్ణములోనూ, రెండవది వెండి రంగు లోనూ ఉంటుంది. రసవాద విద్యలో ఈ రెండిటిని ఉపయోగించాలి. ఇది ఉత్తమ లోహవేధ కారకం.

## అష్ట ఉప రసములు

గంధకం, హరితాళం, మనశ్శిల, సౌరాష్ట్రం, అభ్రకం, స్వర్ణ గైరికం, రాజావర్తం, కుంకుష్టం. చిలుక ముక్కు వర్ణం వంటి రంగు కలిగిన గంధకం శ్రేష్టమైనది.

# గంధక శుద్ధి

గంధకము స్వభావ – స్వరూపములతో , రసముతో సమాన మైనది. పాలు, అల్లంరసం, భృంగరాజరసం, నిమ్మరసం వీటిలో ఏడు సార్లు శోధన చేసిన గంధకం శుద్ధియగును.

# షట్ లోహములు

బంగారం, వెండి, రాగి, తీక్షణం, వంగం, నాగం ఇవి క్రమేణ బలహీనములు.

# సర్వ లోహసిద్ధి

జెముడు, తెల్లజిల్లేడు పాలు, హలినీ, (ఒక రకమైన గన్నేరు) కంచుకి, సూరణకంద, చిత్రకం, గుంజ, ఉమ్మెత్త, అశ్వగంధం, ఇంద్రవారుణి వీటన్నిటి వేర్లను దంచి ముద్ద చేసి వీటిలో బంగారు లోహపురేకులను 7రోజులుంచి, తిరిగి గేదె మజ్జిగలో నుంచిన లోహదోషములు పోవును. సందేహము లేదు.

# రాగసంఖ్యలు

లోహములకు గల వర్ణములో భేదములుండును. వర్ణాధిక్యము చేతనే స్వర్ణ.లోహము ప్రకాశించును. రత్నములలో కూడా వర్ణము లుండును.

## బీజనిర్మాణ విధి

హేమబీజం, తారబీజం అని రెండు విధములు. పసుపు, ఎరుపు ద్రవ్యాలతో స్వర్ణ నిర్మాణం - తెలుపు ద్రవ్యములతో రజిత నిర్మాణం జరుగును. తిరిగి ఇది కల్పితం, రంజితం, పక్వం అని 3 విధములు. కల్పితం తిరిగి శుద్ధ, మిశ్ర భేదముచే 2 విధములు.

## ద్వంద్వ మేళనం

2 ద్రవ్యములను కలుపు విధానము. హేమాభ్రం, స్వర్ణ అభ్రకం మిశ్రణ చేయు పద్ధతి. ఎఱ్రగలిజేరు, అరటి దుంప, కాకమాచి, తెల్ల గలిజేరు, నరకపాల చూర్ణం, గంజి, టంకణం, ఇవి కలిపి పాలు, నూనె వీటితో మూసలో ఉంచి బాగా ధ్మాతం (ఊదిన) చేసిన స్వర్ణము, అభ్రకము కలిసిపోవును.

## వంగాభ్రం

వంగము దంచి, రసములో టంకణం కలిపి అరటిదుంప రసముతో మర్ధించి, అనంతరం అభ్రకం కలిపి మూసలో ఉంచి ఊదిన వంగాభ్రములు కలిసిపోవును.

## బీజ రంజనం

హేమాక్షిక చూర్ణము, తామ్రచూర్ణము దంద్వమేళనముచే మాక్షిక సత్వముతో రసము రంజితమగును.

# స్వరబీజ నిర్మాణం

హేమాక్షికం, గంధకం, హరితాళం, మనశ్శిల, వైక్రాంతం, కాంతం, సస్యకం, విమలం, స్రోతోంజనం, రసకర్పూరం వీటిని చూర్ణము చేసి, స్వర్ణములో వాహింప చేయవలెను.

# రజిత బీజనిర్మాణం

తీక్షణాభ్రం, తారమాక్షికం, విమలం, రసకర్పూరములను సమభాగములుగా గ్రహించి – వంగం 4 భాగములు ధమన క్రియ ద్వారా చూర్ణము చేసి పుటము పెట్టి భస్మము చేయాలి. ఇది రజిత ములో వేధించును. 32గుణముల తాలభస్మము ప్రక్షేపముచే వంగబీజమని చెప్పబడును.

# రసం

సిద్ధస్థానమందున్న రసము సిద్ధరసముము అనబడును. ఇటు వంటి పాదరసము రోగములను పోగొట్టును. వృద్ధాప్యమును పోగొట్టును. శుద్ధసిద్ధ రసము చేతనే దేహవేధ, లోహవేధ సిద్ధించును. జారణ, సారణ కర్మలయందు ఉపయోగించును. స్వేదన, మర్ధన, చారణ, జారణ (భస్మీకరణం) ద్రావణ, రంజన, సారణ, క్రామణ కర్మలు బాగుగా తెలిసిన వారికే రసకర్మ సిద్ధించును.

రసము స్వేదన చేసిన తీవ్రత్వము వచ్చును. మర్ధన వలన మలము నశించును. చారణ వలన బలము వచ్చును. జారణ వలన బంధనమగును. ద్రావణ వలన ఏకాకారమగును. రంజన వలన వర్ణము వచ్చును. సారణ వలన వ్యాపకత్వము వచ్చును. క్రామణ వలన క్రామణశక్తి పుట్టును. రసమునకు అయిదు గతులు కలవు. ఇవి మలరూపంగానూ, జలరూపంగానూ, ధూమరూపంగానూ, హంస గతి (ఎగిరిపోవుట) నాలుగు విధముల రసము నిష్క్ర మించును. అయిదవ గతి అదృశ్యరూపమైనది. ఇది జీవగతి. దేహము నుండి జీవుడు నిర్గమించినట్లు నిర్గమించును. దీనిని మంత్ర ధ్యానముల చేత నిరోధించవలెను. ధూమం చిటపటలాడుట, కప్పవలె ఎగురుట, అకంపం, వికంపం అనునవి అయిదుఅవస్థలు రసము కుండును. కల్వములో రసము మర్దన చేయునపుడు మూడు గతులు సంభవించును.

జలమునందు హంసగతిలోనూ రెండు గతులు సంభవించును. శుద్ధ రసమునకు స్వర్ణం ఇచ్చి, నియామక ఔషధులతో స్తంభన చేయాలి. నియమనం వల్ల మలగతి, ధూమగతి స్తంభిస్తాయి. ఈ నియమనం వల్ల బుద్బుద ధ్వని లేకుండా అగ్నియందు స్థాయీ భావము పొందును. రసము బాగుగా ఓషధులచే శుద్ధము చేయనిచో,

చిటపటశబ్దము, ధూపము , ఎగిరిపోవుట (మండూకగతి) జరుగును. డోలాయంత్రము నందు మూడు రోజులు బాగుగా స్వేదన చేయ వలయును. స్వేదానంతరమే మర్ధనకర్మ చేయాలి.

రసముద్వారా ఇచ్చుఆహారము(గంధకం–మాక్షికం మొ॥) రసపిష్టికా అని పేరు. ఇట్టి రసగర్భము నందు ద్రవితము చేయుట జారణ అనబడును. అనంతరం రక్తవర్గ గణముచే రంజనం చేయాలి. అనేకసార్లు జారణ చేసి, రంజన చేసిన పిమ్మట స్వర్ణముతో సారణ చేసి, అనంతరం క్రామణ చేయాలి. అప్పుడే రసముతో లోహవేధ చేయాలి. శుద్ధ పాదరసము బ్రహ్మస్వరూపము, మూర్ఛిత రసము విష్ణు స్వరూపము, బద్ధరసము రుద్ర స్వరూపము. రసములో విషం, వహ్ని, మలం అను మూడు దోషములున్నవి. విషదోషము వలన వైషమ్యము, వహ్నిదోషము వలన చర్మరోగము (బొల్లి, కుష్ఠు), మల దోషముచేత ఉదరరోగము. ఈ మూడు రోగములచేత మరణము సంభవించును.

## రసస్వేదన మూలికలు

మహాబలా, నాగబలా, మేఘనాధ, గలిజేరు, మేషశృంగి వీటి రసములచే రసమును నవసారముతో కలిపి మూడు రోజులు స్వేదన చేయాలి. అపరాజిత, మత్స్యాక్షి, సహదేవి, గలిజేరు, త్రిఫలా

ప్రియంగు, పిల్లపీచర వీటి చూర్ణముతో పొట్టులేని ధాన్యామ్లము నందు (గంజి) ఉంచి, సైంధవ లవణం, సొంఠి మరియు పిప్పళ్ళు, చిత్రకం, అల్లం వీటి 16వ భాగముతో రసమును మర్దించి డోల యంత్రములో మందాగ్నిలో మూడురోజులు స్వేదన చేయాలి. ఊడుగ, రసము యొక్క విషదోషమను హరించును. అరగ్వధ – వహ్ని దోషమును, చిత్రికం (Plumbago Zeylanica )మల దోషమును హరించును. కుమారీ సప్తకంచుక దోషమును పోగొట్టును. శస్త్రవేత్త ఈ మూలికలతో రసమును మర్ధించి పాతన చేయాలి. ముందుగా రసమును అభ్రక జారణ చేయాలి. తరువాత అన్ని తత్వములతో జారణ చేసి శుద్ధమాక్షిక జారణ స్వర్గజారణ చేయాలి. రసము వేడిలోనే ద్రావణ చేసి బాహ్యాద్రుతి చేయాలి. తరువాత రంజన, సారణ, క్రామణలు తెలుసుకొని లోహవేధ చేయాలి.

## చారణ జారణ మంత్రము

**ఓం నమో అమృత లోహాయ పరామృత**
**రసోద్భవాయ హుం స్వాహా ॥**

పూర్వం రురు అను రాక్షసరాజు ద్వాదశగుణ తీక్షణ జారిత రసభస్మము 1ఫలం సేవించి బలోన్మత్తుడై భూమిని పెకిలించెను. కైలాసమునే చూర్ణము చేసెను. అపుడు శివుడు ధ్యానము చేసి

పన్నగము (Lead) నందు మనశ్శిల మర్ధించి వీటి సమభాగము రసము జారణ చేసి, ఆ త్రిశూలముతో దానవుని సంహరించెను.

## రస క్రామణ ద్రవ్యములు

వత్సనాభి, గంధకం, మాక్షికం, అభ్రకం, కాకవిష్ఠ, సహదేవి, వహ్నిశిఖ వీటన్నిటి కకల్కముతో రసము క్రామణమగును.

## లోహ - దేహ వేధి రసము

**శ్లో॥ తరుణాదిత్య సంకాశో నానావర్ణః సురేశ్వరి**
**వేధయేద్దేహ లోహాని రంజితో రసభైరవః ॥**

బాలసూర్యునితో సమానమైన అనేక వర్ణములతో రంజితమైన రసము దేహ–లోహ వేధలు చేయును. క్రామణ చేయని రసము ఔషధకర్మకూ, రసాయనకర్మకూ రెండిటికీ పని చేయదు. గంధకముతో కలిసి మూర్ఛితమైన రసము వ్యాధినాశములో విశేషముగా పని చేయును. ఓషధుల ద్వారా మూర్ఛితమైన రసము తిరిగి జీవము పొదదు అనగా చాంచల్యాది దోషములు దానియందు తిరిగి ఉండవు. అజనాయికా మహౌషధీ (నల్లపత్తి) సంపర్కము చేతనే రసము బంధనమగును.

ఈ మహౌషధీ రసముతో పాదరసమును 7రోజులు మర్దించి, దాని శతాంశ మాత్రముతే వేధ జరిపిన దివ్యకాంచన మగును.

14రోజులు మర్దించిన లక్షవేధి రసము సిద్ధించును. 8 లోహములను వేధించును. 21రోజులు మర్దనచే దశ లక్షవేధ, 28 రోజులు మర్దనచే కోటివేధ మహారసము సిద్ధించును. ఈ మహౌషధియే కాక కంకాళ ఖేచరి, మాఘఖేచరీ అను దివ్యౌషధములు రసబంధముతోనూ రసాయన కర్మలో ఉపయోగించును.

ఇవి దొరుకుట దుర్లభము. 64 దివ్యౌషధములు రసౌషధ పరం పరలో నున్నవి. దైవమాయచే మూఢులు వీటిని గుర్తించలేరు. అదివ్యములైన తృణౌషధములు గుహలలో జన్మించును. ఇవి రస బంధనము చేయలేవు. గజారిమూలికా స్పర్శచే, క్ష్మాపాలి దివ్య మూలికచే రసము బద్ధమగును. తృణజ్యోతి అను దివ్యౌషధి కలదు. ఇది రాత్రుల యందు ప్రకాశించును. దీనివేరు పాలల్లో వేసిన పాలు రక్తవర్ణమును పొందును. దీని వేరు, రసము, గంధకము, అభ్రకము, గజనిమ్మ రసముతో మర్దించి రాగిరేకులకు లేపనము చేసి మూడు పుటములు పెట్టిన సర్వసిద్ధి. ఇదే విధముగా ఉచ్చటీరక్తస్నుహీ – నల్లచిత్ర మూలం ఓషధులు రసాయన కర్మలో ఉపయోగించును.

దగ్ధారోహ అను దివ్యౌషధి స్పర్శ మాత్రము చేతనే వేధించును. ఇది స్పర్శవేది మూలిక. దీనిని నరికినా, కాల్చినా వెంటనే చిగురించును. దీనిపూలు ఎరుపు, పసుపు, తెలుపు, నలుపు రంగు

లలో నుండును. శెనగఆకుల వలె నుండును. ఇది గోదావరి, గంగా నది తీరప్రాంతములలో ఉజ్జయినీకి దక్షిణభాగములో లభించును. మూకుడులో మట్టివేసి తెల్ల గురివింద పుష్యమీ నక్షత్రమును కూడి అష్టమీ, చతుర్దశీ తిధులలో పాతి దానిని పెంచవలెను. అనంతరం సిద్ధమంత్రముతో బీజగ్రహణము చేయవలెను.

**"ఓం నమో భగవతి శ్వేతవల్లీ శ్వేతపర్వత వాసిని**
**సర్వ కార్యాణి కురు కురు అప్రతిహతే నమో నమః స్వాహా"॥**

ఇది సిద్ధమంత్రము. ఆరు మాసములు మంత్రపూత జలముతో మొక్కను రక్షించాలి. శుద్ధతామ్రం 900 గ్రాములు మూషా యంత్రము నందుంచి, గంధక రహిత రజితమును బ్రహ్మరీతి, గుంజాచూర్ణము కలిపి ధమనము చేయాలి. ఈ విధముగా చేసిన యెడల సర్వసిద్ధి కలుగును.

## 3 రకముల రససిద్ధి

**ఉత్తమో మూలబంధస్తు మధ్యమం రసబంధనం**
**అధమః పాకబంధ స్యాదేవం త్రివిధ బంధనం॥**

1. **మూలబంధం:-** ఇది కేవలం మూలికల చేత రసబంధనం చేసే విధానం. ఇది ఉత్తమమైనది. దీనికి 64 మూలికలున్నవి.

2. **రసబంధం–** మహారస, ఉపరసములతో చేయు బంధనం. ఇది ముఖ్యమైనది.

3. **పాకబంధకం:-** జారణాదులచే అగ్నివలన చేయు బంధనం. ఇది అధమమైనది. పిండికాబంధం, ద్రుతిబంధం, సంకోచబంధం అనికూడా మూడు రకముల బంధనములు కలవు.

అభ్రకం 1భాగం,పాదరసం 1భాగం, స్వర్ణం 16వ భాగం. ఇవి మూసలో ఉంచి విడం, టంకణంతో ధమనం చేసి శుద్ధిచేయాలి. దక్షిణవర్తంగా కలుపుతూ ధమనం చేసి, పాదరసంతో కలపాలి. ఇది చాలా బలవర్ధకం. దీని భక్షణ వల్ల నరుడు రుద్రతుల్యుడగును. 21రోజులు శుద్ధ గంధకము భక్షించిన స్త్రీ రజస్సు పాదరస బంధన జారణలో ప్రశస్థమైనది.

## వజ్రబంధం

1భాగం వజ్రబంధం, 3భాగములు శుద్ధరసం ఈ రెండిటినీ నాగకేశరములతో మర్దించి కల్కం చేయాలి. దీనిలో 4వ వంతు స్వర్ణరేకులకు లేపనం చేసి వ్యోమవల్లి రసముతో, కాంతలోహం టంకణ చూర్ణముతో, 8వ వంతు అభ్రకంతో కల్పంలో నూరి గంధకం కలిపి పుటము పెట్టాలి. అనంతరం అంధమూసలో ఉంచి క్రామణం –ధమనం చేస్తే రసం ఖోటబంధ మగును. ఇది శతవేధి రసం.

# గంధకబంధం

శుద్ధపాదరసం 50 గ్రా॥, గంధకం 1 పలం రెండూ కలిపి ఉమ్మెత్తరసంతో మర్దనచేసి చక్రయోగంగా (వృద్ధిక్షీణం) భావన (ఆరబెట్టుట) చేసినట్లయితే భస్మమగును. దీనిని అంధమూసలో ధమనం చేస్తే ఖోటమగును.

# దేహవేధ

శుద్ధసిద్ధ పాదరసముతో దేహవేధ చేయవలెనన్న ముందుగా శరీరమును పంచకర్మతో (స్నేహనం, స్వేదనం, వమనం, విరేచనం, ఆస్థాపనం) శుద్ధి చేయాలి. ప్రాతఃకాలమందు మూడు రోజులు నెయ్యి, సైంధవ లవణం పానం చేయాలి. అనంతరం మొగలిపువ్వు కషాయం 3రోజులు తాగాలి.

సమ్యగ్విరేచనం అయిన తరువాత కటుక రోహిణీ కషాయం మూడు రోజులు తాగాలి. నేతితో యవాన్నం భుజించాలి. మోదుగ విత్తనములు, వాయువిడంగముల చూర్ణము బెల్లంతో లడ్డుచేసి తినాలి. దీనివల్ల క్రిములు పడిపోతాయి. దొండకషాయంతో వచ, మిరియం, సైంధవం, పసుపు, పిప్పళ్ళు, శొంఠి, ఉసిరి, గుడూచి, విడంగములతో చూర్ణంచేసి మూడు రోజులు ఆ ద్రవం తాగాలి.

ఈ ప్రకారం దేహశోధన చేసి పాలు, పెసరపప్పుతో శాలిఅన్నం భుజించాలి.

అనంతరం కొంతబలం చేకూరిన తరువాత రసాయన విధి చేయాలి. ఉసిరిరసం, పాలు, తేనె, నెయ్యి, దేవదారు రసం, నూనెలో కలిపి 100 గ్రా దేహస్థితి ననుసరించి మూడు నెలలు రోజూ తాగాలి. అనంతరం "ఆరోట శుద్ధరసం" సేవించాలి. ఇది జీర్ణమైన తరువాత శరీరమును క్షేత్రీకరణ చేసి భక్ష్యమును వృద్ధి పరచాలి. అభ్రకం, స్వర్ణమాక్షికంతో శోధితమై ఊర్ధ్వ,అధః తిర్యక పాతన యంత్రము ద్వారా పాతితమైన రసము భృంగరాజ రసముతో మర్దితమైన పిమ్మట వండినది "ఆరోటరసం" అనబడును. దీనినే దేహసిద్ధికి మొదటి రోజున సేవించాలి.

పారదభస్మ భక్షణలో ఒక సూక్ష్మ దోషమున్నది. భస్మసేవన వల్ల 21రోజుల వరకు తీవ్ర కామవాంఛ కలుగును. 1రోజులోనే 1000 మంది స్త్రీలతో రమించు శక్తిగల వాడగును. స్త్రీ సంగమము వలన రసము దేహమంతా సంక్రమించును. కనుక సంభోగము చేయరాదు. **రసభక్షకుడు కకారాష్టకమును తినరాదు.**

**శ్లో॥ కూష్మాండం కర్కటీచైవ కాళింగం కారవేల్లకం**
**కుసుంభకంచ కర్కోటం కదలీం కాకమాచికం**
**కకారాష్టక మేతద్ధి వర్జయేద్ర సభక్షకః॥**

1. గుమ్మడి, 2. దోసకాయ, 3. పుచ్చకాయ, 4. కాకరకాయ, 5. కుసుంబం, 6. ముట్టుకాకర (ఆగాకర) 7. అరటిపండు, 8. కామంచి, దేహసిద్ధి పొందిన సాధకుడు వందల సం॥లు జీవించును. మంత్రసాధనలో సిద్ధిపొందని వారికి, కల్పకోటి సం॥లైనా రససిద్ధి లభించదు. మంత్రహీన రససాధకులకు దేవదానవులు, భూచరులు అనేక అటంకములు కల్పింతురు.

వీరు స్వప్నము ద్వారా సాధకుల వీర్య-రక్తములను హరింతురు. రసభక్షణ ప్రభాతకాలములోనే చేయవలెను. అతిఎండ, చలిగాలి పనికిరావు. రెండు జాములు పథ్యము ఆచరించాలి. రసఔషధ సేవన కాలములో అతిగా మద్యపానం, భోజనం, అతినిద్ర, అతిగా మేలు కోవడం, అతిమైధునం, ఎక్కువ నడక, అతికోపం, అధికేచ్ఛ, నిరర్ధక వాదవివాదములు జలక్రీడ, నౌకావిహారము, విచారము విడిచి పెట్టాలి. ఆకలిగా ఉండరాదు. పగటినిద్ర పనికిరాదు. ఏదేవతా నైవేద్యము తినరాదు. కర్పూరం సర్వదా విడిచిపెట్టాలి. కుంకుమ లేపం, కాలితో అగ్నిస్పర్శ, గోబ్రాహ్మణులను తన్నడం, స్త్రీలను కొట్టడం, వాత పదార్ధములను తినడం మానేయాలి. పగలూ-రాత్రీ రసాంకుశమంత్రం జపిస్తూండాలి. పెసరపప్పు అన్నం, పాలు, గలిజేరు కూర, మేఘనాదం, సైంధవ లవణం, శొంఠి, నాగరముసై, పద్మమూలం మాత్రమే సేవించాలి. రసము జీర్ణము కానిచో మూర్ఛ,

వణుకు, చర్మంపై పొక్కులు, జ్వరం, ఎక్కిళ్ళు, కడుపునొప్పి, నిద్ర, అతిసారం, లింగస్తంభన, దగ్గు, ఒళ్ళంతా మంటలు కలుగుతాయి.

## వజ్రాంగ సుందరీ రసగుటిక

రససాధకుడు 20తులాలు వంగం, సీసం, రాగి, అభ్రకం, హేమం, రజతం, వజ్రం, లోహం. వీటితో రసం కలిపి మూసలో ధమనం చేస్తే దివ్యగుటిక అగును. దీనినే వజ్రాంగ సుందరీ రసగుటిక అంటారు. దీనిని నోటిలో ఉంచుకొన్నచో దేహ ఆరోగ్యం, బలం, తేజస్సు, లోకప్రియత కలుగుతాయి.

## రసలింగ నిర్మాణము

శుద్ధి చేయబడిన పాదరసము, తమలపాకు రసముతో నూరినచో చంచలత్వ దోషము పోయి, చేతితో గ్రహించుటకు వీలగు నట్లు పేస్టువలె అగును. దానిని ఏదేని లోహముతో కలిపి మూసలో పోసి, అగ్నిచేత కరిగించి, చల్లార్చిన రసమూ మరియు ధాతువు (లోహము) కలిసిపోయి గట్టిపడును. ఇదియే అగ్నిబద్ధము.

20 తులాల పాదరసము పసుపుతో బాగా నూరి నీటితో కడిగిన కొంత మలము పోవును. తరువాత నిమ్మపండ్ల రసముతో నూరిన కొంతమలము పోవును. అపుడు తమలపాకు రసముతో నూరిన చంచలదోషము పోవును. ఒక మట్టిమూకుడులో 18తులముల

తగరము కరిగించి, అందు ఈ రసపిష్టీని వేసి బాగుగా కలియబెట్టి శివలింగాకార మట్టి అచ్చులో పోసి, 15ని॥ ల అనంతరం, చల్లారిన తరువాత తీసిన అగ్నిబద్ధమైన రసలింగ మేర్పడును.

అనంతరము దానికి ప్రాణప్రతిష్ఠా, పూజానాదులు చేయుచూ ప్రతీ పున్నమినాడు లేదా సం॥నకు ఒకసారి కొంత శుద్ధపాదరస నైవేద్యముగా దానికి సమర్పించిన దానిని తనలో లీనము చేసుకొనును.

## అష్టకర్మల అర్ధములు

**స్వేదనం:-** క్షార, అమ్ల, ఓషధులచే డోలాయంత్రము నందు వండుట.

**మర్దనం:-** నూరుట. చారణం-జరణం:- భస్మము చేయుట.

**ద్రావణం:-** ద్రవముగా చేయుట.

**రంజనం:-** రంగు కలిగించుట.

**సారణం:-** తైలములో యంత్రముపై చేయు క్రియ. క్రామణం:- ధాతు మార్పిడి.

## సాంకేతిక పదముల అర్ధములు

**అంధమూస:-** గోస్తనీ ఆకారం గల మూస, సారణకర్మకు ఉపయోగించును.

**ఆరణ్యోపలం:-** అడవి గోవు పిడకలు

**కపోతపుటం:-** 8 పిడకలతో పెట్టు పుటము

**గర్భయంత్రం:-** 4 అం॥ పొ॥, 3 అం॥ వ్యాసము గల మట్టిమూస. దీనికి 20 భాగముల సైంధవలవణం, 1భాగం గగ్గులు నీటితో ముద్ద చేసి, మూసకు పూసి ఆరబెట్టాలి. పాదరసం భస్మం చేయటానికి ఉపయోగిస్తారు.

**తప్తకల్వం:-** వేడిచేసిన లోహకల్వం.

**డోలాయంత్రం:-** ఒకపాత్రలో ద్రవము సగము నింపి, దాని ముఖమునకు 2 ప్రక్కలా రంధ్రం చేసి ఒకపుల్ల గుచ్చి దానిమధ్యలో రసపాత్ర నుంచి పైన మూతవేసి క్రింద మంటపెట్టి స్వేదన చేసేది.

**పాతనయంత్రం:-** పై మూతపాత్రలో నీరుపోసి, కుండక్రింద మంటపెట్టి వండునది.

**వాలుకాయంత్రం:-** ఒకపాత్రలో గాజుకుప్ప ఉంచి, కుప్పి కంఠం వరకు ఇసుకనింపి కుప్పిలో రసం ఉంచి అగ్నితో వండునది.

**భస్మమూస:-** నువ్వుకాడల బూడిద 2 భాగములు, ఇటుకపొడి 1భాగం కలిపి చేసిన మూస. దీనిని రజిత శోధనకు ఉపయోగిస్తారు.

**భూధరయంత్రం:-** మట్టిమూసలో రసం ఉంచి, ఒకగోతిలో ఇసుక చుట్టూ ఉంచి మధ్యలో మూస ఉంచి పైన పిడకలతో మంటపెట్టుట.

**సారణం:-** తైల యంత్రములో రసముంచి స్వర్ణలోహ క్షేపణం చేయుట.

**వజ్రమూస:-** ఊకబూడిద 1భాగం, పాతబట్ట బూడిద 1భాగం, నల్లమట్టి సగభాగం, కంకరపొడి 4వ భాగం, వజ్రవల్లీ రసముచే 12 గం॥లు నూరి మూస తయారుచేయాలి. దీనిని రసబంధనము నకు ఉపయోగిస్తారు.

**శివార్పణమస్తు.**